# రాష్ట్ర సేవిక.....

# సోదరి నివేదిత







రచన

**కవిశేషాచలం**

ప్రథమ ముద్రణ: ఏప్రియల్ 1991

ప్రచురణ

భారత ప్రకాశన్ ట్రస్ట్
కొమ్మువారివీధి,
సత్యనారాయణపురం,
విజయవాడ.

ముద్రణ:

విజయవాడ ఆఫ్‌సెట్ ప్రింటర్స్
పిచ్చయ్యవీధి, లబ్బీపేట,
విజయవాడ-10.

ప్రతులకు:

సాహితినికేతన్
ఏలూర్ రోడ్, విజయవాడ.

సాహితినికేతన్
బరకత్‌పురా, హైదరాబాద్.

వెల: రూ. 6-00

# FORWARD



Nivedita is not a mere proper noun, a personal name that identifies the famous western desciple of Swami Vivekananda. Historically, it is the name of a process that began to fulfil the missionary ambition of the Swamiji 'to conquer the world through our spirituality and religion.' Socially it is the modern name of the basically unbigoted behaviour of our great society to accept and grow rather than reject and fossilise. Nationally, it is the new name of the re-emerging phenomenon of this ancient land that went on assimilating into the very being of our national life races after races that came to conquer us long ago.

It is generally held that Raja Ram Mohan Roy is the father of Modern Bharatheeya Renaissance. Through his Brahma Samaj he checked the flow of Hindus into Christianity and to some extent reacted succeesfully against social stagnation.

Dayanand Saraswathi, the succeeding Maharathi of the Renaissance advanced a step further and cleared the way to regain what we lost due to centuries of slavery, self-forgatfullness and suicidal barricading. He started the Suddhi Movement and re-converted thousands of our brethren who forsook the Dharma of their fore-fathers. Also did he create in millions of people a positive pride in our national Ethos. Never-the-less it was only re-capture of the lost ground and acceptance of the prodigal sons.

If Renaissance was to be true, it was not to stop here. The age-old dynamism to attract, accept and assimilate had to be once again acquired and manifested. "The sacred charm and strength that dwell on Aryan altars, flaming free" which once upon a time brought into our social fold a Grecian Dianaputra Heliodorus, a Syrian Antiochos, an Egyptian Philadelphos, a Macedonian

Antigonos and many such, had to be re-kindled. That was the demand of times, and a natural expectation.

Precisely that is what came to pass by Swami Viveka nanda's global visit and work. His was a mission not merely to check, not even to recapture but decidely to conquer. To borrow Nivedita's words, it was 'Aggressive Hinduism in action.' As proclaimed by her "our work is not now to protect ourselves, but to convert others. Point by point we are determined not merely to keep what we had but to win what we never had before. —It is not how much we kept, but how much have we annexed."

As providence would have it she herself was one among the annexed. With her conversion the historical process was on.

The acceptance of what is acquired is easily said than done. In a traditional society of very long standing it has its own constraints and conditions. But this problem was solved by Vivekananda in a typically Bharateeya way. If the beloved mother of a family accepts a new-comer all others follow suit. So the was convinced that if the Holy Mother Sarada Devi with her outward conservative life and behaviour would accept the western lady disciple Bharat would accept her in days to come.

Margeret Elizabeth Noble had landed in Calcutta on 28th Jan, 1898. After about 50 days of acclimatisation on 17th March, the Guru led his disciple to the Holy Mother. It was a symbolic meet of the young west entreating to sit at the feet of the Mature East. Here was the mute question hanging in the silent air awaiting a momentous answer. The heartsof the Guru, the Sishya as well as the invisible witness of the entire Hindu Samaj pulsated. And lo: the answer came: Mother smiled and beckoned her; addressed her 'Kookkie' my child; seated her beside on the cot and caressed her. She ate with her 'Kookkie'.

The East accepted the West as its child and the West the East as its mother. 'Is not that Grand'. Exclaimed Vivekananda to his Gurubhai Ramakrishnanand. Exactly seven days later he made his disciple 'the Dedicated' - Nivedita. Verily it was the begining of a new era of Hindu Conquest.

To merge herself unidentifiably into the National Whole became the primary and foremost duty of the Dedicated - Nivedita. From Samarpan to Samlayan, is the natural course of life's flow. We see this happening in the case of Nivedita also. And unfailing was the hand that moulded her towards it. To a pointed question Swami Vivekananda advised her "you have to set yourself to Hinduise your thoughts, your needs, your connections and your habits. Your life, internal and external has to become all that a Brahmana Brahmacharini ought to be. The method will come to you if only you desire it sufficiently. But you have to forget your own past and to cause it to be forgotten. You have to loose even its memory."

Here we see the Prajna Poorani, Bharat Mata, through her conquering Hero explicitly giving expression to the penomenon of national assimilation. And shall we fearlessly call it 'Nivedita Phenomenon'? Here it would do good if we remember the words of Poet Ravindranath Tagore who knew her intimately. He said, "She was indeed a Lokamata, a mother to the people. We are familiar with the mother's role in the family; but the image of a mother whose love enfolded a whole people was something we had never seen before. We have had male devotion to public duty, but never before had we witnessed such magnificent sweep of womanly devotion. When we referred to 'our people' the feeling in her voice rang more true than in the voice of any one of us."

From Ms Margaret Noble to Sodari Nivedita - there is a sea-change, and through metamorphosis. **It is an interesting hazarduous journey from a question to an answer. 'Ms Noble was the question posed to the Resurgent Reawaksned Bharat by the material West and 'Sodari Nivedita' was the answer given by the spiritual East.** Nivedita, the name as said in the begining is more a historical process, a social behaviour and a national phenomenon of Bharatheeya Renaissance, than a mere adventourous life of a human being. For the truly living and heroically working it is a model to emulate and an example to follow. With that vision and spirit let us read and understand the great life story in the pages that follow.

R. Hari

Elamakkara,
COCHI 682026

# రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్ అఖిలభారత సహ బౌద్ధిక్ ప్రముఖ్ శ్రీ రంగాహరి గారి ముందుమాటకు తెలుగు అనువాదం

నివేదిత కేవలం ఒక నామవాచకమే కాదు. స్వామి వివేకానందుని ప్రసిద్ధ పాశ్చాత్య శిష్యురాలిని స్ఫురించే వ్యక్తి పేరు. చరిత్రపరంగా పరిశీలిస్తే "మతం, ఆధ్యాత్మికతల ద్వారా జగాన్ని జయించాలన్న" స్వామీజీ ప్రగాఢ వాంఛను ప్రస్ఫుటిస్తూ ప్రారంభమైన ప్రక్రియకు మరో పేరు. సామాజికపరంగా పరికిస్తే వర్జించి వినాశం పొందేకంటే, స్వీకరించి వృద్ధిపొందాలనే మన మహోన్నత సమాజ సహనశీల ప్రవర్తనా మూలసూత్రానికి ఆధునిక నామం. జాతీయ దృక్పథంతో విశ్లేషిస్తే గతంలో మనల్ని జయించాలని వరుసగా వచ్చిన తెగలన్నిటినీ జాతీయ జీవనస్రవంతిలో కలుపుకుంటూ వచ్చిన పురాతన పుణ్యభూమి పునర్వికాస మూల ప్రక్రియకు వినూత్న నామకరణం.

ఆధునిక భారతీయ పునర్వికాసానికి రాజా రామమోహనరాయ్‌ని పితామహునిగా భావించడం కద్దు. ఆయన తన బ్రహ్మ సమాజం ద్వారా క్రైస్తవ మతంలోనికి ఉరుకుతున్న హిందూ ప్రవాహానికి అడ్డుకట్ట వేశాడు; సాంఘిక స్తబ్ధతకు విరుద్ధంగా కొంతమేరకు విజయవంతంగా స్పందించాడు.

తదనంతర పునర్వికాస మహారథి, దయానంద సరస్వతి మరో అడుగు ముందుకు వేసి శతాబ్దాల బానిసత్వం, ఆత్మ

విస్మృతి, ఆత్మహత్యా సదృశ గిరిగీతలవల్ల కోల్పోయిన ప్రాభవాన్ని పునరుద్ధరించడానికి మార్గం సుగమం చేశాడు. ఆయన శుద్ధి ఉద్యమం ఆరంభించి పూర్వీజులు అనుసరించిన ధర్మానికి విరుద్ధంగా మారిన వేలాది మన సోదరులను తిరిగి స్వధర్మానికి మరలించాడు. జాతి జీవన గౌరవ గరిమను గుర్తించి గౌరవించేలా లక్షలాది మందిని ఆయన తీర్చిదిద్దాడు కూడా. ఏదేమైనా ఇదంతా కోల్పోయిన స్థానాన్ని దక్కించుకోవడమే; తప్పదారిపట్టిన తనయులను అక్కున చేర్చుకోవడమే.

"పునర్వికాసం నిజమైతే అది ఇక్కడే ఆగిపోరాదు. ఆకర్షించి, స్వీకరించి, అంతర్లీనం చేసుకునే సనాతన సమ్మోహనా శక్తిని తిరిగి పొందాలి; ఆకళింపు చేసుకోవాలి".

ఒక గ్రేషియన్ దయనపుత్ర హెలియొడొరస్, ఒక సిరియన్ ఏన్టియోకోస్, ఓ ఈజిప్షియన్ ఫిలడెల్ఫోస్, ఓ మాసిడోనియన్ ఏన్టిగోనస్ వంటి మరెందరినో ఒకానొకనాడు మన సమాజం అక్కునచేర్చి ఆర్యుల దైవపీఠంపై స్వేచ్ఛాజ్యోతిగా వెలిగిన పవిత్ర వర్చస్సు, శక్తి పునర్జ్యోతులై వెలుగులీనాలి. కాలం కోరేది ఇదే. సహజంగా ఆశించేది ఇదే.

స్వామి వివేకానంద విశ్వసందర్శన, కృషిలో అక్షరాలా జరిగిందిదే. ఆయన పవిత్రయాత్ర పరమార్థం కేవలం అరికట్టడానికే కాదు, తిరిగి కైవసం చేసుకోవడానికి అంతకంటే కాదు, దృఢచిత్తంతో జయించుకు రావడానికే. నివేదిత మాటల్లోనే చెప్పాలంటే అదో "హైందవ విజృంభణా చర్య", ఆమె ఎలుగెత్తి

ప్రయత్నించాలి. దాని స్మృతి ఛాయను సయితం విస్మరించాలి," అంటూ వివేకానంద ఆమెకు సలహా చెప్పారు.

ప్రజ్ఞాపూరిణి, భారతమాత విజేత అయిన తన తనయుని ద్వారా జాతీయ మమైక్యతా ప్రక్రియను సుస్పష్టమైన మాటల్లో తేటతెల్లం చేసినట్లుగా మనమిక్కడ గమనిస్తాం. దానిని మనం నిర్భయంగా "నివేదితా ప్రక్రియ అనవచ్చా?" ఆమెను అత్యంత సన్నిహితంగా ఎరిగిన రవీంద్ర కవీంద్రుని మాటలను మనం స్మరిస్తే ఇది మరింత విశదం కాగలదు. "ఆమె నిజానికి లోకమాత, ప్రజలకు తల్లి కుటుంబంలోని తల్లి పాత్ర మనకు సుపరిచితమే; కాని యావత్ప్రజానీకానికి మాతృమూర్తి అయిన తల్లిపాత్ర మనమెరుగం. విద్యుక్త ప్రజాసేవకు అంకితమైన పురుషులను చూశాం, కాని అంకితభావం గల మహోన్నత మహిళా మూర్తిని చూసి ఎరుగం. 'మన ప్రజ' అని ఆమె ఉచ్ఛరించినప్పుడు ఆమె స్వరంలో తొణికిసలాడే నిజమైన భావన మన ఎవరి స్వరాల్లోనూ వినిపించదు."

మిస్ మార్గరెట్ నోబుల్ నుండి సోదరి నివేదిత -ఎంతటి మార్పు! ఎంతటి సమగ్ర పూర్ణ పరివర్తన! అది ప్రశ్న నుండి జవాబు దాకా ఆసక్తికరంగా సాగిన ఒక ప్రమాదభరిత యాత్ర. తిరిగి లేచిన పునరుత్థాన భారత్‌కు భౌతిక పాశ్చాత్యం వేసిన ప్రశ్న 'మిస్ నోబుల్' అయితే, దానికి ఆధ్యాత్మిక ప్రాచ్యం ఇచ్చిన జవాబు 'సోదరి నివేదిత.' తొలుత పేర్కొన్నట్లుగా నివేదిత పేరును ఓ మానవజీవి సాహసిక యాత్రకు

మూగప్రశ్న తేలియాడుతున్న తావది. గురుశిష్యుల గుండెలతో పాటు నిర్వికార సాక్షీభూతమైన యావత్తు హిందూ సమాజ నాడి తీవ్రంగా స్పందించింది. అద్భుతం! సమాధానం రానే వచ్చింది. దైవమాత చిరునవ్వు నవ్వింది. పిలిచింది. సంభోధించింది. "పాపా, (కూకీ) నా చిట్టితల్లీ!" అంటూ మంచంమీద ఆమె ప్రక్కనే కూర్చుని మృదువుగా స్పృశించింది. తన చిట్టి తల్లితో కలిసి భుజించింది. తూర్పు, పడమరను తన తనయగా ఆహ్వానించింది. పడమర తూర్పును తన తల్లిగా అంగీకరించింది. వివేకానంద పరమానంద భరితంలో, "అద్భుతం కదూ!" అన్నాడు గురుభాయి శ్రీ రామకృష్ణానంద్‌తో. సరిగ్గా ఏడు రోజుల తరువాత తన శిష్యురాలిని 'అంకిత' -నివేదితను గావించాడు. హిందూజైత్రయాత్రా సవశకానికి దీనితో అంకురార్పణ జరిగింది.

జాతి మూసలో, గుర్తించలేనంతగా లీనమవడమే నివేదిత ప్రథమ, ప్రధాన కర్తవ్యమయింది సమర్పణ నుండి సంలయనం చెందటం జీవన స్రవంతి సహజ గమనం. నివేదితలోకూడ మనం దీనిని గమనిస్తాం. ఆమెను అలా ఆ దిశగా మలచిన వ్యక్తిత్వం అపరాజితం కదా! (మూర్తీభవించడంలో) ఒకానొక ప్రశ్నకు సమాధానమిస్తూ "ఆలోచనల్లో, చేతల్లో, సంబంధాల్లో, అలవాట్లలో నీవు హైందవీకరణ చెందాలి. అంతర్, బాహ్య రూపాలలో నీ జీవితం బ్రాహ్మణ బ్రహ్మచారిణికి ప్రతిరూపం కావాలి. ప్రగాఢవాంఛ నీలో ఉంటే దీనికి మార్గం నీకే తెలుస్తుంది కానీ నీవు నీ గతాన్ని విస్మరించాలి. విస్మృతి కోసం

చాటినట్లుగా "మన ప్రస్తుత కృషి మనల్ని పరిరక్షించుకోవడానికి కాదు, ఇతరులను మన వైపు త్రిప్పుకోవడానికి. కేవలం మన గత వైభవాన్ని నిలుపుకోవడానికేగాక గతంలో మనకు లేనిదానిని జయించడానికే మనం కృతనిశ్చయులమై వున్నాం........ మనం ఎంత నిలుపుకున్నాం అనే దానికంటే ఎంత జయించాం అనేది ముఖ్యం."

విధివశాత్తు అలాంటి జయాలలో నివేదిత ఒకరు. ఆమె మార్పిడితో ఈ చారిత్రక ప్రక్రియకు అంకురార్పణ జరిగింది.

జయించిన దానిని ఇముడ్చుకోవడం చెప్పినంత సులభం కాదు. అతి పురాతన సమాజంలో దానికి కొన్ని అవరోధాలు, షరతులు వుంటాయి. అయితే వివేకానంద విలక్షణ భారతీయ రీతిలో ఈ సమస్యను పరిష్కరించాడు. కుటుంబంలోని ప్రేమ స్వరూపిణి అయిన తల్లి కొత్త వ్యక్తిని స్వీకరిస్తే తక్కినవారంతా అక్కున చేర్చుకుంటారు. ప్రగతిశీల భావజీవి దైవమాత శారదా దేవి ఈ పాశ్చాత్య శిష్యురాలిని అంగీకరిస్తే భారత్ క్రమేణా అంగీకరిస్తుందని ఆయన విశ్వసించాడు.

మార్గరెట్ ఎలిజబెత్ నోబుల్ 1898 జనవరి 28 న కలకత్తా చేరుకుంది.. కొత్త పరిసరాలకు అలవాటుపడిన 50 రోజుల తరువాత మార్చి 17 న గురువు తన శిష్యురాలిని దైవమాత వద్దకు నడిపించాడు. పరిపక్వ ప్రాచ్యపాదాల చెంత తరుణ పాశ్చాత్యం కూర్చోవడానికి చేసే ప్రయత్నానికది ప్రతీక. తక్షణ సమాధానం కోసం నిశ్శబ్ద వాయువులో

ప్రతీక అనే దానికంటే ఒక చారిత్రక ప్రక్రియకు, సామాజిక నడవడికి భారతీయ పునర్వికాసానికి చిహ్నం అనడం సమంజసం. సత్యజీవనం గడిపే వారికి, వీరోచితంగా కృషిసల్పే వారికి అది అనుకరించదగిన నమూనా, అనుసరణీయత. ఉదాహరణ ఆ దృష్టితో, ఆ స్ఫూర్తితో ముందు పేజీలలోని ఈ మహోన్నత జీవిత చరిత్రను చదివి తెలుసుకుందాం!

ఆర్. హరి
సహబౌద్ధిక్ ప్రముఖ్
ఎలమక్కర,
కొచి 682026

అది 1895వ సంవత్సరం. నవంబరు నెల. చల్లనిగాలులు వస్తున్న ఆదివారం సాయం సమయం. లండన్ పట్టణమంతా ఆదివారపు హడావుడిలో మునిగి ఉంటే, శ్రీమతి ఇసాబెల్ మార్గస్సన్ ఇంట్లో ఒక అపూర్వమైన వాతావరణం నెలకొని ఉంది.

డ్రాయింగ్ రూంలో సుమారు పదిహేనుమంది కూర్చుని ఉన్నారు. ఎదురుగా ఉన్నతాసనంపై కాషాయాంబరధారియైన ఒక భారతీయ సన్యాసి పద్మాసనంలో కూర్చుని ఉన్నారు. ఆతని ముఖం గంభీరంగా ఉంది. కళ్ళు ప్రేమామృతాన్ని కురిపిస్తున్నాయి. అందరూ ఆసక్తితో, రెప్పవాల్చకుండా ఆతనినే చూస్తూ చెవులు రిక్కించుకొని ఆ సన్యాసి మాటల కొరకు ఎదురుచూస్తున్నారు.

ఇంతలో గుమ్మం దగ్గర అలికిడయ్యింది. పొడుగాటి సిల్క్ గౌను వేసుకొని బంగారు తీగల్లాంటి జుట్టుతో, పెద్ద పెద్ద నీలికనులతో కంగారుగా చూస్తూ చేతిలో చిన్ని నోటు పుస్తకంతో ఒక వనిత ప్రత్యక్షమైంది. కొంచెం ఎరుపు తిరిగి ఉన్న ప్రకాశవంతమైన తెల్లని శరీరం, సమానమైన ఎత్తు కలిగి ఉన్న ఆమెవైపు అందరి కళ్ళూ తిరిగాయి. అక్కడ ఏర్పడిన ప్రశాంత గంభీర వాతావరణాన్ని గమనించి, తన రాకవలన ఏర్పడిన అంతరాయానికి ఒకింత నొచ్చుకుంటూ గబగబా లోనికి ప్రవేశించింది. తన సిల్కు బట్టల రాపిడి వలన శబ్దం అవుతున్నదని గ్రహించి కొంచెం గౌనును పట్టుకొని నెమ్మదిగా అందరికంటే ముందుకు వెళ్ళి కూర్చుంది.

వెంటనే ఆ ఇంటి యజమాని శ్రీమతి ఇసాబెల్ లేచి "స్వామీ రావలసిన మిత్రులందరూ వచ్చేసారు" అని చెప్పింది. వెంటనే స్వామిజీ ప్రసంగం ప్రారంభమైంది. పరమపవిత్ర శివ పంచాక్షరీతో మొదలైన ఆ ప్రసంగం మొదట మందాకినిలా

సాగుతూ, మధ్యలో జలపాతాల హోరును గుర్తు తెస్తూ సంస్కృత శ్లోకాలూ, వాటి ఆంగ్లానువాదంతో ఉరకలెత్తే భాగీరధిలా సాగింది.

"ప్రాక్పశ్చిమ దేశాల మధ్య సాంస్కృతిక వారధి నిర్మింపబడాలి.......... ప్రపంచ ప్రజల హృదయాలు ఏకాత్మభావనతో పెనవేసుకోవాలి. ఈ ఏకాత్మ భావన ప్రపంచమానవాళికి హిందుత్వం నుండే లభిస్తుంది. భారతదేశమే దీనికి ముందు నిలుస్తుంది.........." ఈ విధంగా సాగిన ఆ మృదుమధుర గంభీర ప్రసంగం శ్రోతలను మంత్రముగ్ధులను చేసింది.

ఇటువంటి అద్భుత ప్రసంగం చేసి ఆ పాశ్చాత్య శ్రోతలకు అపూర్వ మార్గదర్శనం చేసిన ఆ స్వామిజీ- శ్రీ వివేకానందులు.

అందరికంటే గుండెలోతుల్లో ఏవో తెలియని ఆధ్యాత్మిక భావాలు గుచ్చుకున్నట్లుగా అనుభూతి చెందింది ఆఖరిగా వచ్చిన వనిత. ఆమె పేరు మార్గరెట్ ఎలిజబెత్ నోబుల్ ఆంగ్లేయుల దమనకాండను తరాలుగా ఎదురుకొంటూ స్వేచ్ఛ కొరకె పోరాడుతున్న ఐరిష్ జాతికె చెందిన నోబుల్ వంశపు వనిత.

స్వేచ్ఛాగానంతో పునీతమైన తన హృదయవీణను, ప్రాగ్దిశా రాగాలతో శృతి చేసి వివేకానందుని ప్రేరణతో హైందవ సంస్కృతీ గానమాలపించిన ఈమె భారతమాత ప్రియపుత్రికయై 'నివేదిత'గా భారతీయుల హృదయాలలో చిరస్థాయిగా నిలచింది.

## బాల్యంలోనే

యూరోపుఖండంలో ఇంగ్లండు దేశాన్ని ఆనుకొనియున్న చిన్న దేశం ఐర్లాండు. అనేక సంవత్సరాల ఆంగ్లేయుల ఉక్కుపాదాల క్రింద నలిగిపోతూ స్వేచ్ఛకోసం తీవ్ర సంఘర్షణ నెరపింది. 19వ

శతాబ్దపు ప్రథమార్థంలో యూరోపును కబళించిన మతయుద్ధాల ప్రభావం ఐర్లాండుపై కూడా పడింది. ప్రొటస్టెంట్లు, కేథలిక్కులు ఐర్లాండులో భీకరమైన వీధి పోరాటాలు చేసుకున్నారు. అదే సమయంలో స్వేచ్ఛావాయువులు పీల్చాలనే తపన సామాన్య ప్రజలకు కూడా కలిగి, స్వాతంత్ర్య పోరాటం కూడా ఉధృతమైంది.

జాన్‌నోబుల్ అనే ప్రొటస్టెంట్ మతాచార్యుడు ఈ స్వాతంత్ర్య కాంక్షను రగిలించడంలో ప్రముఖపాత్ర వహించాడు. ఉత్తర ఐర్లాండులో వెస్లియన్ చర్చిలో మతాచార్యుడైన జాన్ నోబుల్ స్వయంగా ప్రొటస్టెంట్ అయినప్పటికీ కేథలిక్కులతో కలిసి పనిచేస్తూ ఆంగ్లప్రభుత్వం పై పోరాటం జరిపించాడు. ఈయన సతీమణి మార్గరెట్ ఎలిజబెత్ న్యూలన్. ఈ దంపతులకు కలిగిన ఆరుగురు సంతానంలో నాల్గవవాడు శామ్యూల్ నోబుల్. దేశభక్తి, ధార్మిక భావాలను తండ్రినుండి పుణికిపుచ్చుకున్న శామ్యూల్ మొదట వస్త్రవ్యాపారిగా స్థిరపడినా, ధార్మిక, సేవాభావనలు తీవ్రంగా ఉండే తత్వం కావడం చేత, వ్యాపారం విరమించుకొని మాంచెస్టర్‌లోని వెస్లియన్ చర్చిలో మతాచార్య విధులు నేర్చుకొనడం ప్రారంభించాడు. అంతకుముందే తాను వివాహమాడిన మేరీహేమిల్టన్ కూడా భర్త భావాలకనుగుణంగా నడచుకొనే వనితే కావడంవలన వారి సంసారం సుఖంగానే సాగింది.

ఈ దంపతులిరువురికీ 1867 అక్టోబరు 28వ తేదీన పుట్టిన కుమార్తె మార్గరెట్ ఎలిజబెత్ నోబుల్. ఈమెయే తరువాత కాలంలో నివేదితగా భారతీయుల గుండెల్లో చెరగని ముద్ర వేసింది. శామ్యూల్ నోబుల్ తన తల్లిపై తనకుగల గాఢమైన ప్రేమను కుమార్తెకు తల్లిపేరు పెట్టడం ద్వారా ప్రకటించుకున్నాడు. మార్గరెట్ నాలుగు సంవత్సరాలు వచ్చేదాకా

నాయనమ్మ దగ్గరే పెరిగింది. అక్కడ ఉన్నప్పుడే జార్జి అనే వైద్యుడు పసిపాపయైన ఈమెను ఆడిస్తూ ఉండేవాడు. జార్జి వైద్యం చదవలేదుగానీ ఏదో మూలికా వైద్యం చేస్తూ ఉండే వాడు. ఆ విద్య భారతదేశం నుండి నేర్చుకుని వచ్చానని చెప్పకుంటూ ఉండేవాడు.

శామ్యూల్ కి ఓల్డ్ హోమ్ చర్చిలో బాధ్యతరావడంతో కుటుంబం అక్కడకు మారింది. మార్గరెట్ కూడా తల్లి దండ్రులతోపాటు నివసించసాగింది. శామ్యూల్ ఆరోగ్యానికి ఆ వాతావరణం సరిపడని కారణంచేత వాళ్లు వేరే గ్రామానికి మకాం మార్చారు. ఇక్కడే మార్గరెట్ కి మే అనే సోదరి రిచ్ మండ్ అనే సోదరుడు కలిగారు.

అవిరామంగా సేవాకార్యక్రమాలలోనూ, స్వాతంత్ర పోరా టంలోనూ పాల్గొంటూ శామ్యూల్ నోబుల్ తన శక్తికి మించి పని చేయడం వలన ఆరోగ్యం క్షీణించడం మొదలైంది. తండ్రి అనారోగ్యాన్ని గమనించిన చిన్నారి మార్గరెట్ ఎప్పుడూ అతనినే అంటిపెట్టుకొని ఉండేది. తండ్రితో బాటే సభలకు సమావేశాలకు, మురికివాడలలో సేవలకు వెళ్ళేది. అతిధులను ఆహ్వానించి గౌరవించడంలో తండ్రికి సహాయపడేది.

భారతదేశంలో క్రైస్తవ మత ప్రచారానికి వెళ్లి తిరిగి వచ్చిన శామ్యూల్ నోబుల్ స్నేహితుడొకాయన ఒకవాడు వీరింటికి వచ్చారు. బాలిక అయినప్పటికీ నిండుకుండలా గంభీరంగా ఉండి, చిన్నతనంలోనే పెద్ద పెద్ద మాటలు మాట్లాడుతూ, వెలుగులు చిమ్ముతున్న నీలికళ్లు, విశాల ఫాలభాగం కలిగిన మార్గరెట్ ని చూసి, "నీ వంటి బాలిక భారతదేశంలో ఉండాలి. దేవుని కొరకై ఆర్తితో చూస్తున్న భారతీయులకు నీ వంటివారు అవ సరమున్నది. నాకు వచ్చినట్లు నీకు కూడా ఎప్పుడో ఒకరోజు

పిలుపు వస్తుంది. భారతదేశం వెళ్లడానికి సిద్ధంగా ఉండ"మని చెప్పి ఆశీర్వదించి వెళ్ళారు.

మార్గరెట్ ఏదో తెలియని భావావేశంలో మునిగి పోయింది. ప్రపంచపటంలో భారతదేశం ఎక్కడ ఉందో తండ్రి సహాయంతో చూసి దానిని ఒకసారి ముద్దుపెట్టుకొని ఏవో కలలుకంటూ, శూన్యంలోకి చూస్తూ ఉండిపోయింది.

శామ్యూల్ నోబుల్ ఆరోగ్యం బాగా క్షీణించింది. ఎడతెరిపిలేని ప్రయాణాల వలన ఊపిరితిత్తులు పాడైపోయాయి. ఇంక మృత్యువు చేరువైందని తెలిసి భార్య మేరీతో "భగవంతుని నుండి పిలుపు వస్తే సందేహించక మార్గరెట్‌ని పంపించు. ఆమెను తన రెక్కలను పూర్తిగా తెరచుకొని అనంతమైన ఆధ్యాత్మికాకాశంలో ఎగరనీ. ఆమె భవిష్యత్తులో గొప్ప గొప్ప పనులు చేయవలసి ఉంది." అని చెప్పి కన్నుమూసాడు.

తండ్రి మరణం మార్గరెట్‌ని అంతులేని విషాదసాగరంలో ముంచివేసింది. ఆమె ఒక గొప్ప మానసిక పరివర్తనకు లోనయ్యింది. భవిష్యత్‌లో ఆమె సర్వస్వమూ త్యజించి సన్యాస జీవితం గడపడానికి బహుశ ఇది నాంది కావచ్చు. తండ్రి మరణంతో కుటుంబ పరిస్థితులు తారుమారు కావడంచేత మాతామహుడు హేమిల్టన్, ఇతర బంధువులు కలిసి మార్గరెట్‌ని, ఆమె చెల్లెలు మే నోబుల్‌ని హేలిఫాక్స్‌లో ఒక మతసంస్థ నిర్వహించే ఆవాస విద్యాలయంలో చదివించడానికి నిర్ణయించడంతో ఆమె జీవితంలో నూతనాధ్యాయం ప్రారంభమైంది.

# ఆధ్యాత్మికత మొగ్గలు తొడిగే వేళ

హేలిఫేక్స్‌లో మార్గరెట్ సోదరీమణులు చేరిన ఆవాస విద్యాలయం చాలా తీవ్రమైన క్రమశిక్షణకు మారుపేరు. ప్రధానోపాధ్యాయిని లారెన్స్ చాలా తీవ్ర మతభావాలు కలిగిన క్రైస్తవ సన్యాసిని. చాలా చిన్నతప్పుకు కూడా భరించనలవికాని శిక్ష విధించేది. ఆమె మార్గరెట్‌లోని ప్రత్యేక గుణాలను అర్థం చేసుకొంది. ఈమెలోని నాయకత్వ లక్షణాలు, నమ్రత, స్నేహపూరిత ప్రసంగాలు ఎప్పుడూ పదిమంది స్నేహితురాండ్రను చుట్టూ తిప్పుకొనే ఆకర్షణ లారెన్స్ గమనించేది. అయితే మార్గరెట్ కూడా ఈమె శిక్షలబారిని పడక తప్పేదికాదు. శిక్షననుభవించేటప్పుడు ఆమె పశ్చాత్తాపంతోపడే తీవ్ర మానసిక సంఘర్షణను లారెన్స్ గమనించి, తరువాత ఆమెతో విశ్లేషించి చెప్పి అనునయంగా మాట్లాడేది.

లారెన్స్ తరువాత ప్రధానోపాధ్యాయినిగా వచ్చిన సోదరి కోలిన్స్ ప్రభావం మార్గరెట్ జీవితంపై ఎంతైనా ఉంది. కోలిన్స్ మార్గరెట్‌ను ప్రత్యేకంగా గమనిస్తూ ఆదరాభిమానాలను ప్రకటిస్తూ ఉండేది. తన మేధాసంపత్తితో, మృదుస్వభావంతో, అందరి మన్ననలూ పొందుతున్న మార్గరెట్‌పై ఆమె ప్రత్యేకాసక్తి కలిగి ఉండేది. మార్గరెట్ తన పాఠ్యపుస్తకాలనే కాక అనేక ఇతర పుస్తకాలను చదివేది. వాటిలో ఎక్కువ ధార్మిక గ్రంథాలు, మహాపురుషుల జీవిత చరిత్రలు ఉండేవి.

ఇంత విశేషాధ్యయనం వలన ఆమెకు అనేక సందేహాలు కలిగేవి. వాటన్నింటినీ కోలిన్స్ ఎంతో ఓపిగ్గా తీర్చేది. భగవద్భక్తి ఆమెకు వారసత్వంగా వచ్చిన సంపద. పరిణితి చెందుతున్న ఆమె మనసుకు ధార్మిక సందేహాలు కూడా అనేకం వచ్చేవి.

మరణానంతరం జీవితం ఉంటుందా? మృత్యువు జీవిని అంతం చేయగలదా? సృష్టి ఎలా ప్రారంభమైంది? భగవంతుడు ఎలా ఉంటాడు? ఇలా ఉండేవి ఆమె సందేహాలన్నీ. వీటన్నింటికీ విద్యావంతురాలు, మేధావీ అయిన కోలిన్స్ తార్కికంగా సమాధానం చెప్పేది. వివేకానందునికి కూడా విద్యార్థి దశలో ఇటువంటి సందేహాలే వచ్చేవి!

చూస్తూ చూస్తూ ఉండగానే మార్గరెట్ తన సహాధ్యాయినుల మనోభావాలకు అందనంత ఎదిగి పోయింది. విద్యార్థి సంఘానికి అధ్యక్షురాలిగా ఉంటూనే తన లోకంలో తను ఉండేది. స్నేహితురాండ్రతో ఎక్కువ గడిపేది కాదు. చాలా మృదుస్వభావినిగా, భావుకురాలుగా కనిపించేది. ఇదే సమయంలో ఆమె రచనా వ్యాసంగం కూడా మొదలిడింది. ఆమె రచనలన్నింటినీ కోలిన్స్ శ్రద్ధగా చదివి విమర్శించేది. మార్గరెట్ భవిష్యత్తులో మంచి రచయిత్రిగా రూపొందడానికి ఈమె ప్రేరణ ఎంతైనా ఉంది. ఇన్ని వ్యాపకాలలోనూ ఆమె చదువును అశ్రద్ధ చేయ లేదు. స్కూల్ ఫైనల్ పరీక్షలో ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణురాలైంది. వెంటనే తన కాళ్ళ మీద తను బ్రతుకుతూ తాను నిర్దేశించుకున్న జీవనగమ్యం చేరుకునే ప్రయత్నం ప్రారంభించింది. పదునెనిమిది సంవత్సరాల వయస్సులో 1884లో ఒక పాఠశాలలో ఉపాధ్యాయినిగా చేరడంతో ఈమె జీవితంలో మరొక దశ ప్రారంభమైంది.

# వికసిస్తున్న కుసుమం

ఇంగ్లీషు లేక్ జిల్లాలోని ఒక పట్టణంలో బాలికల ఆవాస విద్యాలయంలో ఉపాధ్యాయినిగా చేరిన మార్గరెట్ అంటే అందరికీ అభిమానమే. విద్యార్థినీ విద్యార్థులు, సహోధ్యాపకులు ఈమెను సమానంగా గౌరవించేవారు. ఈమె బోధనా విధానం అద్భుతంగా ఉండేది.

తాత తండ్రుల వారసత్వంగా ఆమెలో ప్రవేశించిన దైవ భక్తి ఆమెకు వేరే మార్గాలు చూపెట్టింది. అక్కడ స్థానిక చర్చితో సంబంధం పెట్టుకొంది. క్రొవ్వొత్తులు, అగరువత్తులు, పుష్పమాలలతో ఆమె శిలువనలంకరించి, దానిముందు మోకరిల్లి పారవశ్యంతో ధ్యానం చేస్తుంటే సాక్షాత్తు ఆమె దేవదూతగా కనిపించేది. ఈ సమయంలోనే ఆమె తన జీవితాన్ని సన్యాసిని (నన్)గా దేవునికి సమర్పించుకోవాలని నిర్ణయించుకుంది. అయితే భగవత్సంకల్పమేమో! అందరూ ఆమెను నిరుత్సాహపరిచారు.

కాని ఆమె మనసులో ఏర్పడిన వైరాగ్యభావనలను ఎవరు దూరం చేయగలరు. అందుకే తన వైరాగ్యాన్ని పరీక్షించుకోవడానికి, చేస్తున్న ఉద్యోగం వదిలేసి ఒక అనాధశరణాలయంలో చేరింది. ఒక సంవత్సరంపాటు అచ్చటి అనాధ బాలికలతోపాటు కలిసి ఉంటూ వారికి చదువు సంస్కారం నేర్పుతూ, అక్కడి పేదరికాన్ని స్వయంగా అనుభవించి అర్థం చేసుకొంది.

ఆ తరువాత 1888 వ సంవత్సరంలో రెక్స్‌హామ్ పట్టణంలో బొగ్గుగని కార్మికుల పిల్లల పాఠశాలలో ఉపాధ్యాయినిగా నియుక్తి అయింది. దీనితో ఆమెకు తన ఆలోచనలను కార్య రూపంలో పెట్టగలిగే అపూర్వ అవకాశం లభించినట్లయింది.

ఉపాధ్యాయినిగా పనిచేస్తూ, ఒక సాంఘిక సేవా కార్యకర్తగా అందరికీ పరిచయం చేసుకుంటూ అనేక రకాల సేవాకార్యక్రమా లను చేపట్టింది. పోషకాహారం లేని బాలలను, గర్భిణీ స్త్రీలను, క్షయరోగగ్రస్తులను గుర్తించి, వారిపట్టీ తయారుచేసి, సంబంధిత అధికారులకు తెలియజేసి ప్రభుత్వం వారికి సహాయం చేసేలా కృషి చేసింది.

ఈమె ఈవిధంగా క్రైస్తవులలోని అన్ని శాఖలవారికి భేదభా వరహితంగా సేవచేయడం స్థానిక చర్చి అధికారులకు కంటగింప య్యింది. ఈమెను కించపరిచి నిరుత్సాహపరచసాగారు. అప్పుడే ఆమె చర్చి అధికారుల సంకుచిత మనస్తత్వం గురించి ఒక వ్యాసం వ్రాసి పత్రికలకు పంపించింది. సహజంగానే ఆ వ్యాసం సంచలనాత్మకం అయింది.

ఈవిధంగా ఈమె చర్చిపై మొదటిసారిగా ధ్వజమెత్తింది. అప్పటినుండి ఆమె అనేక వ్యాసాలను, కరపత్రాలను వ్రాయడం ప్రారంభించింది. ఒక స్థాయి రచయిత్రిగా ఆమెకు గుర్తింపు వచ్చింది. ఆమె చిన్ననాటినుండి ప్రాణప్రదంగా నమ్మిన క్రైస్తవ భావాలు ఆచరణలో విఫలం కావడంవలన ఆమె హృదయంలో శూన్యత ఏర్పడింది. చర్చికి పోవడం తగ్గించేసింది. క్రైస్తవ ప్రవచనాలకు, వాటి ఆచరణకు మధ్యనున్న అగాధాన్ని అర్థం చేసుకొంది.

ఈ సమయంలోనే ఆమె బుద్ధుని జీవితాన్ని చదివింది. ఆధ్యాత్మికత విషయంలో ఆమెలో ఏర్పడిన వెలితిని బుద్ధుని ప్రవచనాలు పూరించగలిగాయి. ఆమెకుండే సహజమైన ఆసక్తితో బౌద్ధ ధర్మం గురించి, భారతదేశం గురించి, హిందూధర్మం గురించి అధ్యయనం చేయడం ప్రారంభించింది.

మార్గరెట్ చేసే వివిధ నిస్వార్థ సేవా కార్యక్రమాలను,

సామాజిక ఆధ్యాత్మిక విషయాలపై ఆమె రచించే వివిధ వ్యాసాలను, సాహిత్య విమర్శలను శ్రద్ధగా గమనిస్తున్న వెల్ష్ మేన్ అనే ఇంజనీరు ఈమెతో స్నేహం చేసాడు. ఇరువురి అభిరుచులు, భావాలు, ఆలోచనాతీరు ఒకటే కావడం చేత ఒకరికొకరు ఆకర్షింపబడ్డారు.

ఈ ప్రేమ బంధాన్ని శాశ్వతం చేసుకుందామని ఆలోచిస్తున్న సమయంలోనే వెల్ష్ మేన్ తీవ్ర అనారోగ్యానికి గురైనాడు. మార్గరెట్ పరిచర్యలు చేస్తుండగనే అతని ప్రాణాలు అనంతంలో ఐక్యమైనాయి. ఆ మరణం మార్గరెట్ ని క్రుంగదీసింది. భగవంతుడే ఈమె ఏ విధమైన భవబంధాలకు లోనుకాకుండా చూస్తున్నాడేమో!

ఈ విషాదాన్ని తట్టుకోడానికి మార్గరెట్ పరిసరాల నుండి మార్పును కోరుకుంది. రెక్స్‌హామ్ నుండి బదిలీ చేయించుకొని చెస్టర్ చేరుకొంది. చెస్టర్ చేరుకున్న తరువాత ఆమె తన మనసంతటినీ బోధన మీద లగ్నం చేసి, క్రొత్త బోధనా పద్ధతులపై ప్రయోగాలు చేసింది. అదే సమయంలో సోదరి మే కూడా చదువు పూర్తిచేసి ఉపాధ్యాయినిగా స్థిరపడింది.

ఈ సోదరిమణులిద్దరూ తమ సహజమైన లోకసంగ్రహప్రవృత్తి కారణంగా అందరికీ చేరువైనారు. అనేక సాహిత్య కార్యక్రమాలలో పాల్గొనడం మొదలుపెట్టారు. అనేకమంది సాహితీవేత్తలు, విద్యావేత్తలు మార్గరెట్ కి స్నేహితులు అవ్వజొచ్చారు. విద్యావిధానంలో ఈమె చేస్తున్న ప్రయోగాలు సఫలమవ్వడం చూసి అనేకమంది ఈమెను తమ తమ పాఠశాలలకు అధిపత్యం వహించవలసినదిగా ఆహ్వానించసాగారు.

చివరికి 1895లో లండన్‌లో మార్గరెట్ తన స్వంత

స్కూల్‌ని ప్రారంభించింది. దానికి తనకత్యంత ప్రియమైన 'రస్కిన్' పేరు పెట్టుకొంది. దానిని కేవలం బాలబాలికల పాఠశాల మాత్రమేగాక ఔత్సాహికులైన విద్యావేత్తలకు ప్రయోగశాలగా మలచింది. శిశుమనస్తత్వము, శిశుబోధనా విధానము, శిశుఅధ్యయన శాస్త్రము మొదలైన వాటిలో అద్వితీయ పరిజ్ఞానాన్ని సాధించింది. అనేక సాహిత్యసంస్థలతో మంచి పరిచయాన్ని ఏర్పరచుకొంది. "సైసేమ్‌క్లబ్" అనే సాహిత్య సంస్థకు కార్యదర్శిగా ఎంపిక అయింది. దీనిలో కామన్స్ సభ (పార్లమెంట్) సభ్యులు కూడా సభ్యులుగా ఉండేవారు. దానితో లండన్ పట్టణంలో మంచి సాహితీ విమర్శకురాలిగా, విద్యావేత్తగా పేరు గడించింది.

భగవంతుడు మళ్లీ మార్గరెట్‌ను ఒక తీవ్ర పరీక్షకు గురిచేసాడు. మొదటి ప్రేమ వ్యవహారం దుఃఖాంతమై, ఆ విషాద ఛాయలు ఆమె మనసునుండి తొలగుతున్న సమయంలో మరొకవ్యక్తి ఈమెకు సన్నిహితుడయ్యాడు. ఒకరికొకరు అర్థం చేసుకొని, మిత్రుల ప్రోద్బలంతో ఇంక వివాహముహూర్తం నిర్ణయించుకుందామనే సమయంలో- మరొక స్త్రీని వివాహం చేసుకున్నాడా మహానుభావుడు.

విధి ఆడిన ఈ ఆటలో కూడా విజయము మార్గరెట్‌నే వరించింది. మొదట్లో తీవ్ర మనస్తాపానికి గురైనప్పటికీ కేవలం కొన్నిరోజులలోనే గుండె దిటవు పరచుకుంది. కొంతకాలం తన గురువు, అప్తురాలైన కోలిన్స్ సోదరి వద్దకు వెళ్ళి మానసిక వేద దీర్చుకొని వచ్చింది. ఆమె అనుభవించిన ఈ మానసిక సంఘర్షణ ఆమె ఆధ్యాత్మిక ఆలోచనలు మరింత పదునెక్కడానికి దోహదకారి అయింది. ఆమె మళ్ళీ ఆత్మవిశ్వాసంతో గంభీరవదనంతో ఉత్సాహంగా ఉండే మామూలు మార్గరెట్ అయిపోయింది.

# గురుసన్నిధిలో

1893 లో చికాగోలో జరిగిన సర్వమత సమ్మేళనంలో పాల్గొని, హైందవ ఆధ్యాత్మిక భావనా తరంగాలలో అంద రినీ ముంచెత్తిన నవయుగ వైతాళికుడు స్వామీ వివేకానంద. చికాగో ప్రసంగానంతరం పశ్చిమ దేశాలలో సనాతనధర్మ శంఖారావం చేస్తూ ఒక హైందవ ప్రభంజనాన్ని సృష్టిస్తూ, హిందూధర్మం గురించి సాధికారికంగా మాట్లాడగలిగిన వ్యక్తిగా గుర్తింపు పొందాడు. కొందరు ఆంగ్లేయ స్నేహితులు ఆహ్వానిం చడంతో 1895 లో హిందూధర్మం గురించి ప్రసంగించడానికి లండన్ చేరుకున్నాడు.

లండన్‌లో కూడా ఆయన చేసిన ప్రసంగాలు స్ఫూర్తివం తంగా, జ్ఞానప్రదాయకంగా ఉన్నాయనే వ్యాఖ్య మేధావి వర్గంలో వినిపిస్తోంది. ఈయన ప్రసంగాల గురించి మార్గరెట్ కార్యదర్శిగా ఉన్న సెసేమ్‌క్లబ్‌లో కూడా చర్చ జరిగింది. మార్గరెట్‌కి అత్యంత ఆప్తురాలు, స్వయంగా సాహితీవేత్త అయిన శ్రీమతి ఇసాబెల్ మార్గస్సన్ స్వామీజీని తమ యింటికి ఆహ్వానించింది. తన స్నేహితుడైన శ్రీ కుక్ ద్వారా మార్గరెట్ కూడా స్వామీజీ ప్రసంగాలు వినడానికి వచ్చేటట్లు చేసింది.

తమ సెసేమ్‌క్లబ్‌లో స్వామీజీ గురించి అనేక ఆసక్తికర విషయాలు వినడం చేత, భారతీయ ఆధ్యాత్మికత గురించి అంత కుముందే అధ్యయనం చేసి ఉండడం చేత మార్గరెట్ వెంటనే ఆ ఆహ్వానాన్ని మన్నించి ఆ హిందూ యోగి ప్రసంగాన్ని వినడానికి వెళ్లింది.

వివేకానందుడు మాట్లాడిన ప్రతిమాటను ఆమె శ్రద్ధగా

వింది. అయితే విన్న ప్రతీదానినీ యథాతథంగా స్వీకరించే తత్త్వం కాదామెది. తను స్వయంగా విశ్లేషించుకొని తనకి హేతుబద్ధంగా ఉందనిపిస్తేనే ఆమోదిస్తుంది. ఉపన్యాసమంతా విన్న తరువాత మామూలుగా గుండెలోతుల్లో ఏవో తెలియని నూతన భావాలు నాటుకున్నట్టు గ్రహించింది. కానీ శ్రీమతి ఇసాబెల్ ఆమెను ఉపన్యాసం ఎలా ఉందని అడిగితే 'దీనిలో క్రొత్తేముంది' అనేసి వెళ్లిపోయింది.

ఇంటికి వెళ్లిన తరువాత ఆమె గుండెల్లో నాటుకున్న భారతీయ ఆధ్యాత్మిక భావాల సంచలనం ప్రారంభమైంది. అధ్యాత్మికతకు సంబంధించి క్రొత్తభాషను, భాష్యాన్ని, అనేక నూతన విషయములను విన్న విషయాన్ని గ్రహించింది. స్వామి వివేకానంద చెప్పిన మాటలను గుర్తుకు తెచ్చుకొంది.

"శరీరము, బుద్ధి అనే రెండూ ఆత్మచేత నియంత్రింపబడ తాయని హిందువుల నమ్మకం........."

"క్రైస్తవులలాగానే హిందువులు కూడా ప్రేమను ఒక ఉత్కృష్టమైన ధార్మికావేశంగా భావిస్తారు."

"కర్మభక్తి జ్ఞానయోగాలు అనేవి ఆత్మముక్తికి సోపానాలు......"

"స్వర్గానికి చేరడమనేది జన్మరాహిత్యంతో పోలిస్తే హిందువులకు అల్పమైన విషయం."

"మనము కర్మలు చేయాలేగానీ ఫలితం గురించి ఆలోచించకూడదు."

ఆత్మ, పరమాత్మ, పునర్జన్మ, జన్మరాహిత్యం మొదలైన పదాలన్నింటినీ ఆమె స్వయంగా విశ్లేషించుకుంది. హృదయంలో చిన్ననాటినుండి ఏర్పడిన క్రైస్తవ భావాలకు అతీతమైన

ధార్మికభావాలు ఆమె ఎదుట పంచరంగుల బొమ్మలలో ప్రత్య క్షమవ్వసాగాయి.

ఆ తరువాత మార్గరెట్ వివేకానందుని ఏ ఉపన్యాసానికి వెళ్లడం మానలేదు. అన్నింటినీ శ్రద్ధగా విని నోట్స్ (టిప్పణి) వ్రాసుకొనేది. ఆమె ఆవిధంగా వ్రాసుకున్న టిప్పణి ద్వారానే స్వామీజీ ఉపన్యాసాల గురించి మనకు ఎక్కువగా తెలుస్తున్నది.

స్వామీజీ ప్రబోధించిన విషయాలను యథాతథంగా స్వీక రించేదికాదు. అసలు అది ఆమె తత్త్వంకాదు. ప్రతి విషయంలోను వివేకానందునితో తీవ్రంగా వాదించేది. తరు వాత రోజుల్లో స్వామీజీ జీవితంపై ఆమె వ్రాసిన The Master as I sawhim (నేను కాంచిన గురువర్యులు) పుస్త కంలో "నేను స్వామీజీ బోధనలన్నింటినీ అధ్యయనం చేసాను. కానీ నా అనుభవంలోనూ, అంతరంగంలోనూ వాటిని విశ్లేషిం చుకొని హేతుబద్ధమైన సమాధానం లభించే వరకు వాటిని నేను ఆమోదించి స్వీకరించలేదు" అ. వ్రాసింది.

ఈమె ఎంత తీవ్రంగా వాదించినా, ఎటువంటి సందేహం వెలిబుచ్చినా వాటన్నింటికీ స్వామీజీ ప్రశాంతంగా, తార్కికంగా ఉదాహరణసహితంగా సమాధానం ఇచ్చేవారు. సమాధానం విన్న తరువాత ఆమె తదేకంగా స్వామీజీ ముఖంలోకి చూస్తూ ఉండి పోయేది. ఆ మౌనంలోనే ఆమె విశ్లేషణ చేసుకొనేది. ఆమె అంతరంగ మథనాన్ని స్వామీజీ చిరునవ్వుతో గమనిస్తూ ఉండే వారు. మరొక సందర్భంలో ఆమె "ఆ చిరునవ్వే నా అహాన్ని బంధించి సమాజ పురుషుని కాళ్ళపై పడవేసింది" అని.

అందుకే వివేకానందుని వెంటనే ఆమె గురువుగా స్వీకరిం చింది. 'మై మాస్టర్' అని పిలుచుకొనేది. స్వామీజీ మాత్రం

ఈమెను శిష్యురాలిగా సంబోధించేవారు కారు. 'మార్గరెట్' అనే పిలిచేవారు. శిష్యురాలిగా పిలవడానికి ఇంకా సమయముందని ఆయన భావించేవారు. కానీ తన ఉద్యమానికీ, ఆధ్యాత్మిక ధార్మిక విప్లవాలకూ అవసరమైన కార్యకర్తను భగవంతుడే ఇక్కడ సృష్టించి పెంచి పెద్ద చేసాడని, వికసించిన ఈ పుష్పాన్ని భగవంతుని సేవకు తీసికొని వెళ్లడంలో తొందరపడరాదని ఆయన భావించేవారు.

1895 నవంబరు నెలలో స్వామీజీ తన శిష్యులతో కలిసి తిరిగి అమెరికా ప్రయాణమయ్యారు. సుమారు ఆరునెలల తరువాత మళ్ళీ లండన్ వచ్చారు. ఈసారి ఎనిమిదినెలల పాటు లండన్‌లోనే ఉన్నారు. ఈ ఆరునెలల కాలంలో స్వామీజీ బోధనలన్నింటినీ విశ్లేషించుకొని తన వ్యక్తిత్వాన్ని వాటికనుగుణంగా మలచుకొనే అపూర్వ అవకాశం లభించింది మార్గరెట్‌కి.

స్వామీజీ సిద్ధాంతాలన్నింటినీ తాను స్వయంగా అధ్యయనం చేయడం ప్రారంభించింది. తన మిగిలిన పనులు, బాధ్యతలను పక్కకు నెట్టేసింది. స్వామీజీ వ్యక్తపరచిన భావాలను తనదైన భాషలో తన హృదయంలో నిక్షిప్తపరచుకొంది. వివేకానందుడు ఏ గురువు గురించీకాక, ఒక ప్రత్యేక ఆరాధనా విధానం గురించిగానీ లేదా ఏదో ఒక దేవీదేవతల గురించిగానీ కాక ఆత్మసాక్షాత్కారం పొందడం, ఆత్మముక్తిని సాధించడంవంటి విశ్వవ్యాపక హైందవ సిద్ధాంతాలు గురించి చెప్పిన మాటలు ఆమెను తీవ్రంగా ఆకర్షించాయి.

"నీలోని అహాన్ని చంపుకొని, ఆ స్థానంలో విశ్వవ్యాప్తియైన భగవంతుణ్ని ప్రతిష్ఠించుకో, అప్పుడు సమాజంలోని ప్రతీ మనిషిలోను భగవత్సాక్షాత్కారమవుతుంది. అప్పుడు సాటి మనిషికి నీవు చేసే సేవ నారాయణసేవయే అవుతుంది............ అటు

వారితో పోల్చి చెప్పుతుండగానే ఆయన కళ్లవెంబడి కన్నీరు ధారలు కట్టేది.

ఒకరోజు మార్గరెట్ తాను నడిపే 'రస్కిన్ స్కూల్'కు వివేకానందుని తీసికొని వెళ్లింది. అక్కడ బాలబాలికలకు లభించే ఆధునిక విద్యను గమనించి తనదేశపు బాలల స్థితిని తలచుకొని స్వామీజీ ఏడవడం ప్రారంభించారు. "దౌర్భాగ్యులైన మా బాలలకు చదువులేదు చెప్పించడానికి మావద్ద ధనంలేదు. వారంతటవారు చదువుకోరు......వారికి చదువు నేర్పాలంటే మనమే వారి దగ్గరకు వెళ్లాలి. పర్వతం మహమ్మద్ వద్దకు రాకపోతే, మహమ్మదే పర్వతం వద్దకు వెళ్లాలి."అని అనిన స్వామీజీ పలుకులు ఆమె హృదయాన్ని కలచివేసాయి.

క్రమేపీ మార్గరెట్‌లో భారతదేశం వెళ్లి సేవచేయాలనే కుతూహలం పెరుగుతోంది. కాని స్వామీజీ తనను వ్యక్తిగతంగా ఆహ్వానిస్తారని ఎదురుచూస్తోంది.

మార్గరెట్ చాలా సహజమైన అధ్యయనశీలి కనుక స్వామీజీని ఆయన ప్రభోదాలను చాల దగ్గరనుండి అధ్యయనం చేస్తోంది. ప్రత్యేకమైన ఒక మత పంధాని ప్రచారం చేయడం కాకుండా విశ్వమానవాళి సుఖసంతోషాల కొరకు ఆధ్యాత్మికత సజీవంగా ఉండాలనీ, ఆధ్యాత్మికత చిరంతనంగా ఉండాలంటే హిందూదేశం పతనావస్థ నుండి ఉద్ధతి పొందాలని, దీని కొరకు శ్రేష్ఠతను పురుషసింహాలను తయారుచేయాలనే ఆయన తలపెట్టిన వ్యక్తి నిర్మాణ మహోద్యమాన్ని ఆమె సక్రమంగా అర్థం చేసుకొంది. భారతీయుల గురించి ఆయన పడే తపనను గమనించిన మార్గరెట్ ఆయన తలపెట్టిన ఉద్యమానికి తనవంతు కృషి కూడా జత చేయాలని సంకల్పించింది. ఒకరోజు చెప్పింది "స్వామీజీ భగవదేచ్ఛ ఇదే అయితే నేను కూడా మీతో వచ్చి

పనిచేస్తాను. మీ కృషిలో నన్ను కూడా పాలుపంచుకోనీయండి"

కొంతసేపు స్వామీజీ ఏమీ మాట్లాడలేదు. తరువాత అన్నారు. "నేనొక సన్యాసిని. అంటే ఎండనకా వాననకా తిండీ, బట్టా గురించి ఆలోచించకుండా తిరిగేవాడిని... నువ్వు పనిచేయదలిస్తే నీకు కూడా ఇటువంటి స్థితే ఎదురవుతుంది. కానీ ఏదో ఒకరోజున ఇటువంటి సన్యాసులే జట్లు జట్లుగా గ్రామాలకు వెళ్లి అభాగ్య హిందూ సోదరులను మేలుకొలిపి జ్ఞానప్రబోధం చేసేరోజు వస్తుంది..." అని చెప్పారు.

అయితే ఈ మాటలలో మార్గరెట్‌కు స్పష్టమైన మార్గదర్శనమేమీ లభించలేదు. మరొకసారి ఒక సమావేశంలో మాట్లాడుతూ "హిందూ సంస్కృతీ ప్రవాహం అవిచ్ఛిన్నంగా సాగడానికి కారణం హిందూ మహిళ. కానీ ఆమెకు చదువులేదు. ఆమె కేవలం వంటయింటికి మాత్రమే పరిమితమవుతోంది. తనకు సహజసిద్ధ వరాలైన ఓర్పు, సహనం, మాతృత్వము మొదలగు వాటన్నింటినీ తన కుటుంబం కొరకే వినియోగిస్తోంది... ఈవేళ భారతదేశానికి కావలసినది ఒక స్త్రీ సింహం. భారతీయ మహిళలో విద్యాబుద్ధులు నేర్పడానికి నీవంటి మహిళ కావాలి" అని మార్గరెట్‌ని ఉద్దేశించి అంటూ, మళ్లీ అందరినీ ఉద్దేశించి "నేటి హైందవ మహిళలు ఎవరో పాశ్చాత్య మహిళ వచ్చి తమను ఉద్ధరిస్తారని, మార్గదర్శనం చేస్తారని ఎదురుచూస్తున్నారు" అని అన్నారు.

మార్గరెట్ దీనిని తనకు లభించిన వ్యక్తిగత ఆహ్వానంగానే భావించింది ఆమె ఒళ్లు ఒక్కసారి జలదరించింది. ఏదో ఒక అవ్యక్తమైన భావోద్వేగానికి లోనయ్యింది. ఏదో చెప్పాలనుకొని చెప్పలేక భళ్లున ఏడ్చేసింది. ఒక ఉన్నత వ్యక్తిత్వం మరింత ఉన్నతాదర్శం ముందు తలవంచినదనడానికి ఇది నిదర్శనమా?

స్వామీజీతో కలిసి ఆయన మార్గదర్శనంలో పనిచేస్తూ అభాగ్యులకు సేవచేస్తూ తన భావిజీవితం గడపాలని దృఢనిర్ణయం తీసికొంది మార్గరెట్. భారతదేశమే తన యవ్వనానంద నందనం గావాలని, తన వార్ధక్యపు వారణాశి గావాలని నిశ్చయం చేసుకొంది. ఈవిధమైన నిర్ణయంవలన ఉత్పన్నం కాబోయే అన్నిరకాల పరిస్థితులను వ్యక్తిగతంగా విశ్లేషించుకొంది.

కానీ స్వామీజీకి ఇష్టంలేని ఆలోచనా విధానమనేది ఆయనకు "స్వీయవ్యక్తిత్వాన్ని మరుగునపరచుకొని మతాభినివేశంతో ఏదో సేవచేసేవాళ్లు" కాదు కావలసింది. "మేరుసమున్నత వ్యక్తిత్వాన్ని నిలుపుకుంటూ సింహపరాక్రమంతో, స్వేచ్ఛాభావాలతో స్వయంప్రేరణతో నిస్వార్థంతో కార్యరంగంలో దుమికేవాళ్లు కావాలి. అసలు ఆయన దృష్టిలో ఇతరులకు సేవచేయడమంటే మనలను మనం సేవించుకున్నట్లు... అంతేగాని ఎవరికో నావలన ఏదోఒనగూడుతుంది అనే కించిత్ అహం కూడా" సేవావ్రతులకు పనికిరాదు.

మార్గరెట్ తన మనసులో తీక్షణరూపం దాల్చుతున్న సేవాకోరికను స్వామీజీ ముందు స్వయంగా ఉంచలేకపోయింది. అందుకే అమెరికా నుండి వచ్చిన స్వామీజీ శిష్యురాలూ, తన కాప్తురాలూ అయిన హెన్రెట్టాముల్లర్‌తో స్వామీజీకి చెప్పించింది.... "స్వామీజీ మార్గరెట్ మీతో కలిసి సేవచేయడానికి భారతదేశం వస్తానంటోంది" అని.

స్వామీజీ పెద్దగా ఏ భావననీ వ్యక్తపరచలేదు. ఆయన ఒకటే అన్నారు "నేనైతే నా ప్రజలకొరకు నేస్వీకరించిన కార్యం పూర్తిచేయడానికి అవసరమైతే వందజన్మలైనా ఎత్తుతాను" ఈ మాట ఆమె గుండెల్లోకి సూటిగా చొచ్చుకుపోయింది. అదేరోజు ఆమెతో స్వామీజీ వ్యక్తిగతంగా మాట్లాడుతూ "భారతదేశంలో

నువ్వు సేవాకార్యార్థం రావచ్చు. నువ్వు భారతదేశానికి చెంది నదానవే... అయితే దానికింకా నీవు సిద్ధం కావాలి" అన్నారు.

ఆమె దిగ్భ్రాంతితో చూసింది. "ఇంకా సిద్ధం కావాలా? ప్రియాతి ప్రియమైన తన రస్కిన్‌స్కూల్‌ను వదులుకొని తను సంపాదించిన ఆస్తిపాస్తులను పేరుప్రతిష్ఠలను కాదనుకొని, భవ బంధాలను తెంచేసుకొని భారతదేశపు అభాగ్యసోదరులను సేవిం చవస్తున్నట్లు ప్రకటిస్తే... ఇంకా సిద్ధం కావడమేమిటి?"

## అగ్నిపరీక్ష

1896 డిశంబరులో స్వామీజీ భారతదేశం ప్రయాణమ య్యారు. స్వామీజీతో పయనమైన కొద్దిమంది శిష్యబృందంలో మార్గరెట్ లేదు. స్వామీజీ శిష్యబృందంతో మార్గమధ్యలో ఇతర ఐరోపా దేశాలలోకూడా పర్యటన జరిపారు. ఆ పర్యటనా విశేషాలను స్నేహితులు ఎప్పటికప్పుడు మార్గరెట్‌కి తెలియజే స్తూనే ఉన్నారు. స్వామీజీ స్వయంగా ఉత్తరాలు వ్రాస్తున్నారు. స్విట్జర్లాండునుండి వ్రాసిన ఉత్తరంలో "మానవులు తమలో అంత ర్నిహితంగా ఉన్న దివ్యత్వాన్ని నిత్యం ప్రకటించుకొనేవిధంగా వారికి శిక్షణనివ్వాలి. అజ్ఞానంతో మూఢనమ్మకాలతో బాధపడే వారిని చూసి జాలిపడాలి. వారి ఉద్ధతికొరకు శ్రేష్ఠతమ వ్యక్తులు త్యాగాలు చేయాలి. వందలాది బుద్ధులు జన్మించాలి...."

"ప్రస్తుత ప్రపంచ మతాలన్నీ హాస్యాస్పదంగా తయారవ య్యాయి. నేడు ప్రపంచానికి కావలసినది మతంకాదు- శీలం... నీలో ఆ శక్తి ఉంది. ఓ శ్రేష్ఠతమ స్త్రీ సింహమా జాగృతము కమ్ము... మన హృదయంలో నిద్రాణంగా ఉన్న దేవీదేవతలు లేచేదాకా ఎలుగెత్తి పిలుద్దాము"

ఈ ఉత్తరము ఆమెపై ఎటువంటి ప్రభావము చూపించి ఉంటుందో వేరేచెప్పాలా. స్వామీజీ భారతదేశం చేరుకొని తమ కార్యం మొదలుపెట్టారు. సన్యాసులను, బ్రహ్మచారులను తయారుచేయడం, వారికి శారీరక ఆధ్యాత్మిక విషయాలలో శిక్షణ ఇవ్వడం మొదలైంది. ఈవిధంగా శిక్షితులైన యువకులను అనేక సేవాకార్యక్రమాలలో నియోగిస్తున్నారు. రామకృష్ణమఠం ఏర్పరిచే ప్రయత్నంలో ఉన్నారు.

ఈ వివరాలు ఎప్పటికప్పుడు మార్గరెట్‌కి ఉత్తరాలద్వారా తెలుస్తున్నాయి. కొన్ని స్వయంగా స్వామీజీయే వ్రాస్తున్నారు. మార్గరెట్ శారీరకంగా లండన్‌లోనే ఉన్నప్పటికీ మనసంతా భారతదేశంలోనే ఉంది. ఎప్పుడు భారతదేశం వెళ్దామా ఎప్పుడు అమాంతం సేవాకార్యక్రమాలలో దూకుదామా అని ఎదురు చూస్తూ, సాక్షాత్తూ స్వామీజీతోకలిసి పనిచేస్తున్నట్లు కలలుకం టోంది.

మఠం స్థాపించడానికి ఆర్థిక ఇబ్బందులు ఎదురవుతున్నాయనే స్వామీజీ ఉత్తరానికి సమాధానంగా "అవసరమైన ధనసేకరణకు ప్రయత్నం చేస్తాను" అని మార్గరెట్ ఉత్తరం వ్రాసింది. "నేను భారతదేశం వెళ్లగానే, మఠంతోబాటు బాలికల పాఠశాల కూడా ప్రారంభిస్తాను" అని తన డైనందినిలో వ్రాసుకుంది.

స్వామీజీ పైఉత్తరానికి సమాధానంగా "ఇప్పుడు మనుష్యులకంటే అత్యంత అవశ్యకమైన సాధనం డబ్బు... అందువలన నీవు లండన్‌లో ఉండటంచేతనే భారతదేశానికి ఎక్కువ ప్రయోజనకరంగా ఉంటుంది" అని వ్రాసారు. ఉత్తరం చదువుకున్న మార్గరెట్ వెక్కివెక్కి ఏడ్చింది. వెంటనే కోపంతో ఉత్తరం రాసింది. "నన్ను భారతదేశం ఎప్పుడు బయలుదేరి రమ్మంటారు?" అని.

స్వామీజీనుండి తరువాత వచ్చిన ఉత్తరాలలో జరుగుతున్న సేవాకార్యక్రమాలు, మఠం నిర్మాణంలో పురోభివృద్ధి, అగ్రవర్ణాల యువకులు కూడా భేదభావాలకతీతంగా ఎలా పనిచేస్తున్నారో వ్రాసారేగానీ, మార్గరెట్ వ్రాసినదాన్ని గురించి ప్రస్తావనలేదు. ఇంక మార్గరెట్ తట్టుకోలేకపోయింది. ఆమెకు స్వామీజీ తనను పరీక్షిస్తున్నారేమోననిపించింది. ఒక్కసారి ప్రశాంతంగా స్వామీజీ ఆలోచనావిధానంతో తన ఆలోచనలను బేరీజు వేసు కొంది. ఆమె హృదయంలో ఒక మెరుపు మెరసినట్లయ్యింది. వెంటనే భారతదేశం ఉత్తరం వ్రాసింది.

"నాకు స్పష్టంగా, సూటిగా తెలియజేయండి. నేను భారతదేశంలో పనిచేయడానికి పనికొస్తానా? లేదా? .... నేను ఊపిరి పీల్చాలని ఎలా అనుకుంటున్నానో భారతదేశం రావాలని అలా అనుకుంటున్నాను. నేను నా జీవితాన్ని ఎలా సార్థకపరుచుకోవాలో భారతదేశంనుండి నేర్చుకోవాలనుకుంటున్నాను."

ఈ ఉత్తరంతో మార్గరెట్ ఆలోచనలలో స్వామీజీ ఆశించిన మార్పు వచ్చినట్లు స్పష్టమైపోయింది. ముఖ్యంగా ఆఖరివాక్యం ఆమె మనోభావాలకు అద్దంపట్టేదిలా ఉంది. స్వామీజీ వెంటనే జులై 1897 లో ఆమెకు ఉత్తరం వ్రాసారు. "భారతదేశం ఇంకా తన సమాజానికవసరమైన గొప్ప స్త్రీలకు జన్మనీయలేదు. నేడు భారతీయ మహిళాలోకానికి కావలసిన నాయకత్వలక్షణాలన్నీ నీలో ఉన్నాయి. నీ అవసరం ఈ సమాజానికిప్పుడు ఎంతైనా ఉంది"

ఉత్తరంలోని ఈ వాక్యాలను చదివి మార్గరెట్ ఆనందంతో పొంగిపోయింది. ఉత్తరం చదవడం కొనసాగించింది.

"కానీ - భారతదేశ వాతావరణం నీకు సరిపోదు. ఇక్కడి

శీతాకాలం మీ వేసవికాలంకంటే వేడిగా ఉంటుంది. కొన్ని ప్రదేశాలలోనైతే కుంపట్లో ఉన్నట్లే ఉంటుంది - నీ శరీరం దానికి తట్టుకోలేదు.. ."

తట్టుకొనే శక్తి నాకు ఉంది. నా శరీరమేమైనా, నేను వచ్చి-తీరుతాను. దృఢసంకల్పం చేసికొని వేగిరమైన హృదయస్పందనతో ఉత్తరాన్ని ఇంకా చదివింది.

"ఇక్కడి పేదరికం, ప్రజల మూఢనమ్మకాలు, అజ్ఞానము ఒక పట్టాన నీకు అర్థమవ్వవు. అనాగరిక ప్రజల మధ్యలోకి వచ్చిపడినట్లు భావిస్తావు... అంతేకాదు నువ్వు తెల్లజాతి స్త్రీవి కనుక నిన్నందరూ ద్వేషిస్తారు, వ్యతిరేకిస్తారు. మీ తెల్లజాతి ప్రజలు నిన్నొక మూర్ఖురాలిగా భావిస్తారు"

నేనొచ్చేదే అటువంటి ప్రజలకోసం. ఇంక తెల్లప్రజల విషయ-మైతే, వారితో ప్రవర్తించేతీరు నాకు తెలుసు అనుకుంటూ మార్గ-రెట్ స్వామీజీ ఉత్తరం చివరిభాగం చదవసాగింది.

"చివరిగా, నువ్వు ఇక్కడికి వచ్చేముందు ఇవన్నీ కూలం కషంగా ఆలోచించుకో. నువ్వు కార్యరంగంలో దుమికినాక విఫలమైనా, సఫలమైనా విసుగుచెందినా, వేదాంతధర్మాన్ని వ్యతి రేకించినా, భారతదేశం గురించి పనిచేసినా, మానివేసినా ఆమ రణాంతం నేను నీవెంటే ఉంటాను... ఏనుగు దంతాలు ముందుకే పొడుచుకొని వచ్చి ఉంటాయిగానీ వెనుకకుపోవు. పురు షసింహాల వాక్కులు కూడా అటువంటివే... మరొక హెచ్చరిక! నీకు ఇక్కడకు వచ్చాక ఎవరిరెక్కల సాయమూ ఉండదు."

చాలు స్వామీజీ చాలు. మీరిచ్చిన ధైర్యంతో ఏ పనైనా ఎక్కడైనా చేయగలను అనుకొంది. వెంటనే బయలుదేరాలని నిశ్చయం చేసుకొంది. అగ్నిపరీక్షలో నెగ్గింది. అగ్నిపునీత సీత అయ్యింది.

# మహానిష్క్రమణ

మార్గరెట్‌కు భారతదేశంలో సమర్థవంతంగా పనిచేయడానికి అవసరమైన సైద్ధాంతిక శిక్షణను స్వామీజీ ఉత్తరాలద్వారా ఇస్తూనే ఉన్నారు. ఒక ఉత్తరంలో ఇలా వ్రాసారు "నన్ను చాలా మంది గాఢంగా ప్రేమిస్తూ ఉంటారు. కానీ నేనెవరినీ తిరిగి అంతగా ప్రేమించను. కనుక నేను అనాసక్తంగానే ఉంటాను... లేకపోతే పనిచేసే కార్యకర్తలలో అసూయాద్వేషాలు రగిలి తమ పనులు పాడుచేసుకుంటారు. కనుక నాయకుడనేవాడెప్పుడూ ప్రేమవిషయంలో ఉదాసీనంగా అనుబంధరహితంగా ఉండాలి... నా ఉద్దేశం నాయకుడు ప్రేమరహితంగా ఉండాలనిగానీ తమను అభిమానించేవారిని తన అవసరాలకు వాడుకొనేవాడనీ కాదు.

"నా ప్రేమ పూర్తిగా వ్యక్తిప్రస్తావన లేనిది. నేనూ తీవ్రంగా ప్రేమిస్తాను. కానీ అవసరమైతే నా ప్రజలకొరకు సమాజం కొరకు నా స్వీయహస్తాలతో నా హృదయాన్ని పెకలించుకోగలను... అనుబంధభావాలు పనులను పాడుచేస్తాయి. అందుకే మనం వజ్రమంత కఠినంగా, పుష్పమంత మృదువుగా ఉండాలి"



ఈ ఉత్తరాన్ని ఒకటికి పదిసార్లు చదువుకొంది మార్గరెట్. తను భారతదేశం వెళ్లినతరువాత స్వామీజీకున్న అనేకమంది శిష్యులలో ఒకతెను, అక్కడ స్వామీజీ తనపై ఎటువంటి ప్రత్యేకమైన శ్రద్ధను కనబరచకపోవచ్చుననే ఆలోచనకు మానసికంగా సన్నద్ధమవ్వసాగింది.



ఇంక ప్రయాణానికి అన్నిరకాలుగా సిద్ధమవ్వసాగింది. తన ప్రయాణవిషయం ఆంతరంగికులొకరిద్దరుతోతప్ప బయటకు పొక్కనీయలేదు. సన్నిహితులవద్ద సెలవుతీసుకున్న తరువాత తల్లిదగ్గరకు వెళ్లింది. తల్లి మేరీ నోబుల్ ఈమె చెప్పబోయే

విషయాన్ని ముందుగానే గ్రహించింది. ఇంత ఉన్నతురాలయిన కుమార్తెను చూస్తూ చూస్తూ ఒదులుకోడానికి ఏ తల్లి ఇష్టపడుతుంది? కానీ ఆమె తన భర్తకు చేసిన వాగ్దానం గుర్తుకొచ్చింది. కన్నీటితోనే కుమార్తెనాశీర్వదించి పంపించింది.

మార్గరెట్ కి తమ కుటుంబానికి తనే ఆధారమని తెలుసు. తల్లినీ, చెల్లినీ, తమ్ముణ్ణి తనే పోషిస్తోంది. ఇపుడు ఆమె లేకపోతే ఎలాగ? చెల్లినీ తమ్ముణ్ణి కూర్చోబెట్టి చర్చించింది. తన రస్కిన్ స్కూల్ యాజమాన్యాన్ని చెల్లెలు మేరీకి అప్పగించింది.

ప్రయాణంరోజున ఓడరేవుకు అమ్మ, చెల్లెలు, తమ్ముడు, మరొక ఇద్దరు స్నేహితులు వచ్చారంతే. భావోద్విగ్నతతో, మొండి ధైర్యంతో ఓడ ఎక్కింది. అందరూ వీడ్కోలు చెబుతూండగా ఓడ అనంతసాగరంలో కనుమరుగవ్వసాగింది. ఓడపై అంచున మార్గరెట్ అలా నిలబడే ఉంది. గాలికి బంగారుముంగురులు ముఖాన్ని కప్పేస్తున్నా సవరించుకోవడంలేదు. బుద్ధుని జీవితచరిత్ర పుస్తకాన్ని చేతుల్లో దృఢంగా పట్టుకొని ఉంది. 'ఆమరణాంతం నీవెంట ఉంటాను' అని స్వామీజీ ధైర్యం చెబుతూ వ్రాసిన ఉత్తరాన్ని ఆ పుస్తకంలో పెట్టుకుంది!' అప్పుడామె కళ్లకు సిద్ధార్థుడు భార్యాబిడ్డలను విడిచివెళ్లే దృశ్యం కనిపిస్తోంది.

ఆపుకోలేని హృదయమ్ము నదిమిపట్టి
దూరమగుచుండె ప్రభువు సంసారమునకు
శ్రీయు శ్రీమతియును చిరంజీవిలేని
ఈ మహానిష్క్రమణ కర్థమేమి కలదో

- కరుణశ్రీ

# తల్లి ఒడిలో...

అది 1898 సంవత్సరం - జనవరి 28వ తేదీ. మంచి చలిరోజులు. మంచు బాగా పట్టివుంది. గంగాసాగరంలో, గంగా సంగమ ప్రవాహాన్ని చీల్చుకుంటూ మార్గరెట్ ప్రయాణం చేస్తున్న 'మొంబాసా' ఓడ కలకత్తా రేవు చేరుకొంది. ఓడలో సందడి మొదలైంది. అందరూ సామాన్లు సర్దుకుంటూ గందరగోళంగా మాట్లాడుకుంటున్నారు. మార్గరెట్ మనసులో సంచలనం ప్రారంభమయ్యింది. మాతృదేశం విడిచి ఇన్నివేల కిలోమీటర్ల దూరం వచ్చేసింది. ఈ దేశంలో తనకు తెలిసింది ఒకే ఒక వ్యక్తి. ఆయన కూడా కలవకపోతే! గుండె మారుమూల పొరల్లో ఏదో అనుమానకంటకం గుచ్చుకుంటోంది.

ఓడలోనుండి అందరూ దిగుతున్నారు. వారు మాట్లాడుకునే మాట ఒక్కటీ అర్థమవ్వడంలేదు! ఈ కంగారులో కూడా ఆమె ఒక విషయం మరచిపోలేదు. తను భారతదేశపు గడ్డపై ఉంది! నిజమే. ఇది కలకాదు. ఆనందంతో గంతులు వేయాలని ఉంది. చాలాకాలం తల్లినుండి దూరమైన పసిపాప మళ్లీ తల్లి పొత్తిళ్ల చేరగానే పొందే అనిర్వచనీయమైన ఆనందమిది. ఈ ఆనందాన్ని మూగగా అనుభవిస్తూ ఉండగానే ఎదురుగా తనకోసమే వస్తున్న స్వామీ వివేకానంద కనిపించారు. హృదయాంతరాళాల్లోంచి ఏదో ఒక అమృతధార చివ్వున పైకెగసినట్లు అనుభూతి చెందింది. వెంటనే స్వామీజీకి అభివందనములు తెలియజేయాలనుకొంది. కానీ ఎలాగ? భారతీయపద్ధతి ఇంకా అలవాటవ్వలేదు. ఆమె ఆ డోలాయమానస్థితిలో ఉండగానే స్వామీజీ శిష్యులలో ఒకరు ఆమె మెడలో తెల్లని పుష్పమాల వేసి స్వాగతప్రణామాలు చేసారు.

స్వామీజీ మార్గరెట్‌ను ఒక గుర్రపుబగ్గీలో ఎక్కించుకొని కలకత్తా నగరంలోని చౌరంగీ బస్తీకి తీసికొని వెళ్లారు. దారిలోనే కుశలప్రశ్నలు వేసారు. దారి పొడుగునా ఆమె కళ్లింతింత చేసుకొని ప్రతిదానినీ వింతగా చూస్తూ ఉండిపోయింది. ఆమె మొదట చౌరంగీ బస్తీలో ఒక హోటల్‌లో బసచేసింది. మొదటి నాలుగైదురోజులు అక్కడే ఉంది.

మార్గరెట్ కొన్నిరోజులు పనిగట్టుకొని కలకత్తా నగర సందర్శనం చేసింది. ఆమె వ్యక్తిగతంగా, ఒకళ్లిద్దరు ఆంగ్లేయులతో కలిసి వెళ్లినప్పటికీ చూడగలిగింది కేవలం ఆంగ్లేయులు ఎక్కువగా నివసించే ప్రాంతాలే. ఆమె హిందూ సామాజిక జీవనం ఎలా ఉంటుందా చూడదలుచుకొని ఒక అద్దెకారులో మారుమూల ప్రదేశాలలో తిరిగి కూలంకషంగా అన్నీ పరిశీలించింది.

మార్గరెట్ కలకత్తా చేరిన కొద్దిరోజులకు అమెరికానుండి మరొక ఇద్దరు వనితలు కూడా కలకత్తా వచ్చారు. వారు స్వామీజీ సహచర్యంలో ఆయన బోధనలు వింటూ కొంతకాలం భారతదేశంలో గడపడానికి వచ్చారు. వారిలో ఒకరు శ్రీమతి సారాఓల్‌బుల్ మరొకరు కుమారి జొసఫిన్ మేక్లైడ్. వీరిరువురూ స్వామీజీకి అమెరికాలో పరిచయమైనారు. స్వామీజీ ప్రసంగాలతో తీవ్రంగా ప్రభావితమై వారితోపాటు భారతదేశము వచ్చారు. మార్గరెట్‌కి వీరిద్దరితో మంచి సాన్నిహిత్యమేర్పడింది. వీరితోడు ఆమెకు ఆ జీవనమూ లభించింది.

వీరు కలకత్తాకి ఐదుమైళ్ల దూరంలో బేలూరదగ్గర నిర్మించబోయే మఠందగ్గర ఉంటున్నారు. మార్గరెట్ కలకత్తాలోనే ఉంటూ హిందూ జీవనవిధానాన్ని అధ్యయనం చేస్తోంది. ఆమెకు ఆతిథ్యం ఇస్తూన్న, స్వామీజీ శిష్యులలో ఒకరు నగరాంతరం పోవడంవలన మార్గరెట్‌నుకూడా ఆ అమెరికన్ శిష్యులవద్దకు

తీసికొని వచ్చారు స్వామీజీ. అంతకుముందు వీరు లండన్‌లోనే కలుసుకొని ఉండడంచేత, ఈ పునస్సంగమం సంతోషప్రదమే అయ్యింది.

వీరి ముగ్గురికీ స్వామీజీ దర్శనం, మార్గదర్శనం ప్రతీరోజూ లభిస్తున్నాయి. స్వామీజీ వీరుండే ప్రదేశానికి సుమారు ఒకమైలు దూరంలో ఉండేవారు ప్రతీరోజూ ఉదయం వీరి కుటీరానికి వచ్చేవారు. స్వామీజీ రాకతో ఆ కుటీరంలోని వాతావరణం ప్రశాంత గంభీరతలను సంతరించుకొనేది. వీరికి అనేక విషయాలను స్వామీజీ విశ్లేషించి బోధిస్తూ ఉండేవారు. వేదాంతం, ఆధ్యాత్మికత, అద్వైతం, కర్మయోగం, హైందవ పురాణేతిహాసాలు సామాజిక సాంప్రదాయక సాంస్కృతిక విషయాల గురించి విపులంగా ఉదాహరణ సహితంగా చెప్పేవారాయన. ఏ విషయం చెప్పినా చివరకు ముగింపు ఒక్కటే-

"హిందువులలో అంతర్నిహితంగా ఉన్న శక్తియుక్తులను వెలికితెచ్చి ఒక అజేయమైన హిందూ సమాజాన్ని నిర్మించాలి".... "దీనికి సమాజ సేవయే సరైన మార్గం. సేవలోనే పూజితుడు, పూజ, పూజారి ఒకరు అవుతారు".... ఆకలితో అజ్ఞానంతో బాధపడే వేలాది సోదరులను చూసి మన హృదయం ద్రవించాలి. వారే మన నిజమైన దైవతములు... "మనము జాగృతమగుదాం. సుషుప్తిలోనున్న మన సోదరులను కార్యనిమగ్నులు కావలసిందిగా ఎలుగెత్తి చాటుదాం."

స్వామీజీ చెప్పే వివిధ విషయాలపై తరుచూ వేడి చర్చ సాగేది. చర్చను సాధారణంగా మార్గరెట్ ప్రారంభించేది. స్వామీజీ భారతీయతగురించి పాశ్చాత్య శిష్యురాండ్రు అందరికీ చెప్పడం ఒక ఎత్తు మార్గరెట్‌కి చెప్పడం ఒకెత్తు. కారణం ఈమెలో ఉండే గ్రాహక శక్తియేకాక వారికీ ఈమెకీ ఆలోచనా

వ్యవహారాలలో, జీవితావగాహనలోనున్న తేడా. వారు కేవలం తాత్కాలికంగా భారతదేశం వచ్చినవారు. మార్గరెట్ మాత్రం తన జీవనకుసుమాన్ని భారతమాతచెంత సమర్పింపవచ్చిన వనిత. అందువలన స్వామీజీ ఈమెపై ప్రత్యేకశ్రద్ధ తీసికొనేవారు. ఆమె తన జీవితాన్ని సరియైన పద్ధతిలో భారతమాత పాదాలచెంత సమర్పించేవిధంగా ఆమెను తీర్చిదిద్దాలి. దానికొరకై ఆమెకు హిందూ పురాణాది సాహిత్యం గురించి స్పష్టమైన పరిజ్ఞానం కలిగించడం, హైందవ సామాజిక సాంప్రదాయిక విలువలపై నిర్దిష్ట అవగాహనను కలిగించడమూ, హిందూ చరిత్ర, చారిత్రక సాంస్కృతిక ప్రదేశాల గురించి తెలియజేయడమూ, హిందూ మహిళ సామాజిక కట్టుబాట్లూ, అలవాట్లూ, జీవనసరళి గురించి సమగ్రంగా తెలియజేయడం ఒక క్రమపద్ధతిలో మొదలుపెట్టారు. రామకృష్ణ మఠానికి చెందిన సన్యాసి ఒకరు ఈమెకు బెంగాలీ నేర్పేవారు.

దీనితోపాటు ఆమె సేవాకార్యక్రమాలలో సులభంగా పాల్గొనడానికి తగిన మానసిక పరివర్తనను తీసుకొచ్చే ప్రయత్నం కూడా మొదలుపెట్టారు. "భగవంతుడు అవతారాలెత్తడానికి గల ముఖ్యకారణం సేవితునికి తగిన విధంగా తనను తాను మలచుకొనుటకొరకే. సేవావ్రతుల ముఖ్యలక్షణం కూడా సేవితల జీవనసరళితో తాము మమేకం చెందడం కావాలి. వారికి అనుగుణంగా మనం మన హృదయకవాటాలు తెరవాలి. అన్నార్తులైన, అణగద్రొక్కబడిన ఈ అజ్ఞానసోదరులు అప్పుడు నీలో, నీ పవిత్రహృదయంలో దైవత్వాన్ని చూస్తారు" అని చెబుతూ ఒక సాంప్రదాయ హిందూ మహిళ ఎలా చీర కట్టుకుంటుందో, ఎలా చాపమీదే పడుకుంటుందో, చెంచాలతో కాకుండా వేళ్లతోనే భోజనం ఎలా చేస్తుందో ఆమెకు క్రమంగా అనుభవంలోకి వచ్చేలా చేయసాగారు.

# తప్పటడుగులు

రోజులు గడుస్తున్నాయి. బౌద్ధిక మానసిక శిక్షణ కొనసాగుతోంది. మార్గరెట్ ప్రారంభించవలసిన బాలికల పాఠశాల గురించిగానీ, చేపట్టవలసిన సేవాకార్యక్రమాల గురించిగానీ స్వామీజీ ఏమీ చెప్పడంలేదు. ఆమెలో ఆత్రుత అసహనం పెరుగుతున్నాయి. ఒక రోజు స్వామీజీని అడిగేసింది "స్వామీజీ నేను చేయవలసిన పనిని గురించి నాకేమీ చెప్పరేమిటి" అని. మౌనమే స్వామీజీ సమాధానమయ్యింది. మళ్లీ అడిగింది. అప్పుడు చెప్పారు. "నువ్వేమి చేయాలన్నదాన్ని గురించి నువ్వు ఆలోచించకు. అది నీ పని గాదు. ఈ పరిసరాలలో సుందరదృశ్యాలమధ్య నీచుట్టూ ఏం జరుగుతుందో నువ్వు గమనించి అధ్యయనం చేయి. అప్పుడు నీకే తెలుస్తుంది"

ఏ విషయంలోనూ తొందరపడకపోవడం నాయకుల లక్షణం. ఈ విషయం ఆమెకు అర్థమవ్వలేదు. అంతేగాదు ఆమెకీ, ఆమె చేరవలసిన గమ్యానికీ మధ్య, తన స్వీయమేధాసంపత్తివలన కలిగిన కొద్దిపాటి అహం, పనిపట్ల తొందరపాటుతో గూడిన తీవ్ర ఆకాంక్ష, ముళ్లకంచెల్లా నిలచి ఉన్నాయని కూడా ఆమె గ్రహించలేదు. వివేకానందుడు తరుచూ చెప్పే కర్మయోగ ముఖ్య సూత్రమైన 'నిష్కామకర్మ' ఆమెకింకా అనుభవంలోకి రాలేదు.

అందుకే స్వామీజీ అంతులేని సహనంతో ఆమెలో సహజంగా కలుగవలసిన పరివర్తన కొరకు ఎదురుచూస్తున్నారు. ఆ పరివర్తన కేవలం బోధనల వలన కాకుండా ఆమె అనుభవంలోకి వచ్చిన హిందూతత్వచింతనల ఆధారంగా రావాలని భావించారు. ఈ అనుభవాలు కూడా ఆమెకు సహజంగా కలగాలని ఆయన ఆకాంక్షించారు. అందుకే ఆమె ఈ ఆలోచనల అగాధాలలోనికి

పడిపోకుండా, సంక్లిష్ట ఆధ్యాత్మిక చింతనలలో చిక్కుకుపోకుండా భయానికి, ఒత్తిడికి ఒంటరితనానికీ లోనుకాకుండా ఉండడానికై ఒకసారి లాలించే తండ్రిలా, మరొకసారి వేలుపట్టుకొని నడిపించే సోదరునిలా, ఒకసారి విషయ వివరణచేసే గురువుగా ఇంకొకసారి సేదదీర్చి ఓదార్చే స్నేహితునిగా స్వామీజీ ఆమెకు సహాయప డుతూ ఉండేవారు.

మార్గరెట్ మిగిలిన పాశ్చాత్య స్త్రీలలాగా కేవలం భారత దేశం సందర్శించి స్వామీజీ సహచర్యంలో గడపడానికి వచ్చిన స్త్రీ కాదు. ఆమె ఒక నిర్దిష్ట లక్ష్యంతో వచ్చింది. ఆమె లక్ష్యం నెరవేరాలంటే, భారతదేశ ఉజ్జ్వల భవితను ఆమె లక్ష్య సాధనతో ముడిపెట్టాలంటే ప్రజాబాహుళ్యానికి ఆమెనూ, ఆమె మేధాసంపత్తినీ పరిచయం చేయాలి. దానికి సమయంకొరకు ఎదురుచూస్తున్నారు స్వామీజీ.

ఆ సమయం రానేవచ్చింది. స్వామీజీ భారతదేశం వచ్చిన ఆరువారాల తరువాత మార్చి 11 వ తేదిన కలకత్తా "స్టార్ థియే టర్"లో ఏర్పాటయిన రామకృష్ణమఠ ప్రారంభసభలో స్వామీజీ ఆమెను సభాముఖంగా పరిచయం చేసారు. "మన ఉద్యమం ముందుకు సాగడానికి ఇంగ్లండు ఇప్పటికే కొందరు మ్యాణిపూాస లవంటి వారిని ఇచ్చింది. ఇప్పుడు మరొక వనితారత్నం మన సేవకై మనముందు నిలిచివుంది. ఆమెపేరు మార్గరెట్ ఎలిజబెత్ నోబుల్. ఆమె ప్రసంగిస్తుంది" అని ప్రకటించారు. ఆవిధంగా అలా మొదటిసారి ఆంగ్లేతరులైన సభికులనుద్దేశించి భారతదేశంలో ప్రసంగం చేసింది. ఎంతో హేతుబద్ధమైన వాదన లతో శ్రోతల కళ్లలోకి ఆత్మీయతతో, ఆత్మవిశ్వాసంతో చూస్తూ ఆమె చేసిన ప్రసంగానికి అందరూ మంత్రముగ్ధులైపోయారు.

"ఇది రామకృష్ణమఠ ప్రారంభోత్సవ సమావేశం అనడం

నాకు నచ్చలేదు. ఎందుకంటే ఈ ఉద్యమం ఎంతోకాలం ముందే ప్రారంభమైంది. ఒక పురుషసింహం, హైందవ సన్యాసి హిందూ ధర్మంగురించి మాట్లాడడానికి అమెరికా వెళ్లగలిగినప్పుడే ప్రారంభమైంది" అని వివేకానందుని ఉద్దేశించి అంటూ "ఇంగ్లండుపై హైందవాధ్యాత్మికతాభావాల ప్రభావం" అనే విషయంపై తన ప్రసంగాన్ని కొనసాగించింది.

"గత అర్ధశతాబ్దినుండి ఆధ్యాత్మికంగా మేము (ఆంగ్లేయులు) ఉన్నతిని సాధించినప్పటికీ, గడచిన కొద్ది సంవత్సరాలుగా మా ఆధ్యాత్మికరంగంలో శూన్యత ఏర్పడింది. ఆ శూన్యతను నింపి ప్రాణప్రతిష్ఠ చేయగలిగినవి ఒక్క హిందూ ధార్మిక భావాలు మాత్రమే... భగవంతుడంటే అద్వైతమని చెప్పే హైందవభావన మాకు అపూర్వం. భగవంతుడు అద్వితీయుడైనపుడు దుఃఖమూ, పాపమూ, కష్టమూ, భయమూ మొదలైనవన్నీ భ్రాంతి అని స్పష్టము అవుతుంది. ఈవిధంగా అసలు పాపమనేదే లేనప్పుడు మానవుల తప్పులపట్ల, బలహీనతలపట్ల, భయంపట్ల మనకుండే తూష్ణీభావం సమసిపోయి దానిస్థానాన్ని ప్రేమ ఆక్రమిస్తుంది. ఇది మాకు హిందూత్వమిచ్చిన అపూర్వమైన వరం."

భూనభోంతరాలు దద్దరిల్లే కరతాళ ధ్వనులతో శ్రోతలు తమ ఆనందాన్ని వ్యక్తం చేసారు.

## మహానివేదన

1898 మార్చి 25వ తేదీ - మార్గరెట్ జీవితంలో ఒక సువర్ణపుట. సుమారు రెండు సంవత్సరములనుండి ఆమెలో జరుగుతున్న మానసిక సంఘర్షణ చివరిదశకు వచ్చిన సమయమది. "నా శరీరము, మనసు, బుద్ధి ఇవేమీ శంక నాకు

చెందినవికావు. వీటిని స్వామీజీ చేతుల్లో తద్వారా సమాజ దేవుని పాదాలముంగిట ఉంచుతున్నాను... శిల్పి చేతులలోకి చేరిన శిలను నేను. దీనితో ఏ ప్రతిమను ఎలా మలచాలో శిల్పి ఇష్టం..." ఇటువంటి భావాలను తరుచూ సహచరి అయిన శ్రీమతి సారాబుల్ దగ్గర వ్యక్తపరుస్తోంది. స్వామీజీ ఇంక సమయమాసన్నమైనదని గ్రహించారు. మార్గరెట్ ని బేలూరులోని తన శిష్యుడైన శ్రీ నీలాంబర ముఖర్జీ ఇంటిలోను దైవమందిరం లోకి తీసికొని వెళ్లారు. దేవీప్రతిమ ముందు మోకరిల్లమన్నారు. అక్కడే ఉన్న విభూదిని ఆమె నుదుట అలది, సంపూర్ణంగా వికసించిన ఆమె జీవనకుసుమాన్ని పరమేశ్వరినిచెంత - సమాజ పరమేశ్వరుని పాదాలమ్రోల - నివేదిస్తున్నాననీ, అప్పటినుండీ ఆమె నివేదితగా పిలవబడుతుందనీ ప్రకటించారు.

మార్గరెట్ కి ఆవిధంగా సాంప్రదాయబద్ధంగా రామకృష్ణాశ్రమ పరంపరలో నైష్ఠిక బ్రహ్మచర్యం ప్రసాదింపబడింది. ఈ దివ్య ఘట్టాన్ని మిగిలిన ఇద్దరు పాశ్చాత్య వనితలు నిర్నిమేషంగా చూస్తూ ఉన్నారు. అపరిమితానందంతో 'నివేదిత' స్వామీజీకి సాష్టాంగ నమస్కారం చేస్తూ ఆయన పాదాలమీద వ్రాలిపోయింది. ఆ శుభసందర్భంలో నివేదన చేయబడ్డది తన జీవిత సర్వస్వ మని ఆమెకు తెలుసు. ఈ దశలో ఆమె కోరుకున్నదే అది. తన గురువర్యులైన స్వామీజీ ద్వారా సమస్త దేవీదేవతలు తన నాశీర్వదిస్తున్నట్లు అనుభూతిచెందింది. ప్రకాశవంతమైన ఆయన ముఖంనుండి ఆమెకు జ్ఞానము, కరుణ లభించినట్లయింది. ఆ తరువాత జరిగిన చిన్న పూజా కార్యక్రమం తరువాత ప్రసాదం పంచబడింది. నివేదిత ఆ ప్రసాదాన్ని భక్తితో కళ్లకద్దుకొని స్వీకరించింది.

ఆ వేళంతా ఆమె ఉపవాసముంది. భగవద్ధ్యానంలో గడి

పింది. స్వామీజీ కూడా ఆమెచెంతనే ఉన్నారు. ఆయన కుడా ఒక భావాతీత ఆనందంలో ఉండి, ఏకతార మీటుతూ శివ స్తుతి మొదలుపెట్టారు. శిష్యులు ఆయనతో గొంతు కలిపారు. ఆ గానమాధుర్యంలో తేలిపోతూ నివేదిత భక్తిపారవశ్యంలో దైవత్వాన్ని ఆస్వాదించింది.

ఆ తరువాత స్వామీజీ గంగకి అవతలి ఒడ్డును చూపిస్తూ, "నివేదితా! అదుగో అక్కడ నీవు నీ బాలికల పాఠశాలను ప్రారంభించాలి" అని సూచించారు.

# తీర్థయాత్రలు

హిందూ సమాజానికి సేవచేయడానికి అనుగుణంగా నివేదిత వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దడానికి స్వామీజీ తీర్థయాత్రలు తలబెట్టారు. ఆమెకు హైందవ పుణ్యక్షేత్రాల, చారిత్రిక ప్రదేశాల గొప్పదనము దేశ వివిధ ప్రాంతాలలోని హిందూజీవన విధానము అర్థమవ్వాలి అని స్వామీజీ ఉద్దేశం.

అందుకే 1898 వేసవిలో హిమాలయాల్లోని అల్మోరా బయలుదేరారు. శ్రీమతి సారాబుల్, కుమారి మేక్లెడ్, సోదరి నివేదిత స్వామీజీ వెంట ప్రయాణమయ్యారు. పాట్నా, కాశీ, బుద్ధుడు సంచరించిన తెరాయ్ మొదలైన చారిత్రక, ధార్మిక ప్రాముఖ్యతగల ప్రదేశాలు సందర్శిస్తూ వాటి విశేషాలను స్వామీజీ నుండి తెలుసుకుంటూ అల్మోరా చేరుకున్నారు.

అక్కడ ఒక నెల ఉండి హిమాలయాల శివానందాన్ని అనుభవిస్తూ అనేక అధ్యాత్మిక అనుభూతులు పొందింది నివేదిత. హిమాలయాల సమున్నతత్వాన్నీ, వాటి సానువులలో విలసిల్లి వాటికంటే ఎత్తుకి ఎదిగిన హిందూ ధార్మిక భావాలను స్వామీజీ నుండి తెలుసుకొంది. అక్కడినుండి వీరందరూ కాశ్మీర్ బయలుదేరారు. పంజాబు ద్వారా ప్రయాణం సాగుతుంటే స్వామీజీ ముఖంలో తారసిల్లిన ఆనందోత్సాహాలను చూసి ఆ ప్రాంత విశేషాలను తెలుసుకొన్నది. గురుగోవిందసింహుని వీరత్వము, త్యాగము, ఆయన కుమారుల బలిదానము ఆమె శరీరాన్ని పులకరింపజేసాయి. రావల్పిండి, బారాముల్లా, శ్రీనగర్ పట్టణాలను కూడా సందర్శించారు. అక్కడినుండి అమరనాథ్ మొదలైన దేవాలయాలు చూసారు. తిరుగుప్రయాణంలో లాహోర్, ఢిల్లీ, ఆగ్రా, వారణాశి మీదుగా కలకత్తా చేరుకున్నారు.

ఈ ప్రయాణం ఆమెపై ఎనలేని ప్రభావాన్ని చూపించింది. ఈ యాత్రలవలన ఆమె నిజమైన భారతదేశమంటే ఏమిటో, ఈ దేశపు ఆధ్యాత్మిక లోతులేమిటో స్పష్టంగా అర్థంచేసికొంది. ఈ యాత్రానుభవాలను అన్నింటినీ ఆమె 'టిప్పణి' (Notes) వ్రాసుకుంది. ఆ తరువాత వాటిని ఒక యాత్రికురాలి దైనం దిని (A Piligrimes Diary)గా పుస్తకరూపంలో ప్రచురించారు.

ప్రతీ పుణ్యక్షేత్రంలోనూ, ప్రతీ తీర్థస్థలంలోనూ ప్రతీ చారిత్రక ప్రదేశంలోను ఆమె మమేకం చెందింది. భారతదేశ చరిత్ర గురించి ఆమెకు సమగ్రమైన అవగాహన కలిగింది.

అన్నింటికంటె ముఖ్యంగా ఆమె ఆంగ్లపాలన తీరుతెన్నులను క్షుణ్ణంగా పరిశీలించగలిగింది. ఆమె మార్గరెట్‌గా ఒక ఆదర్శ బ్రిటిష్ పౌరురాలు. బ్రిటిష్ రాజరికానికి రాజపతాకానికి శ్రద్ధతో తల వొగ్గుతుంది. కాని భారతదేశంలో ఆమె చూసిన విషయాలు ఆమె కలలో కూడా ఊహించనివి. తమ పాశవికబలంతో అమాయకులు, అసంఘటితులూనైన కోట్లాదిమందిని అణిచివేయడం, దోపిడీచేయడం ఆమె హృదయంలో తీవ్ర ఆవేదనను రగిలించాయి. తన భవిష్యకార్యంలో ఈ దోపిడీని ఎదుర్కొనడం కూడా ఒక భాగమనే నిర్ణయానికి వచ్చింది.

ఈ వాస్తవాన్ని స్వామీజీ వివరిస్తూ ఉంటే మార్గరెట్ మొదట తట్టుకోలేకపోయింది. ఆమె తన సహజమైన పద్ధతిలో వాదోపవాదాలకు దిగేది. ఆమె ప్రతీవాదానికి అనంతమైన సహనంతో స్వామీజీ సమాధానం ఇస్తూంటే ప్రత్యూషకిరణాలతో మంచు కరిగినట్లు, ఆమె అనుమానాలన్నీ పటాపంచలయ్యేవి. ఈవిధమైన మానసిక సంఘర్షణలో ఒక్కొక్కసారి ఆమె స్వామీజీ వ్యక్తిత్వప్రభావం నుండి తప్పించుకుపోదామా అని కూడా ఆలోచించేది. ఈ సమయంలోనే భగవద్గీతాధ్యయనం ప్రారంభిం

చింది. స్వామీజీ అపూర్వ విశ్లేషణతో కూడిన మార్గదర్శనం, ఆమె అధ్యయన మార్గాన్ని సుగమం చేసింది. ధ్యానం కూడా అలవరచుకొంది.

## కార్యరంగంలో....

కలకత్తా తిరిగి వచ్చిన తరువాత ఆమె బస శారదామాత గృహానికి తాత్కాలికంగా మారింది. రామకృష్ణాశ్రమ పరంపరలోని 'నైష్ఠిక బ్రహ్మచారిణి' హోదాలో ఆమెకు ఆ అర్హత లభించింది. ఇంతకుముందు మ్లేచ్ఛ స్త్రీగా చూసినవారు నేడామెను తమలో కలుపుకున్నారు. మాతృత్వానికి ప్రతిరూపమైన శారదా మాత కూడా ఆమెను కుమార్తెగా సంబోధిస్తోంది. సాక్షాత్తూ కాళీమాతకు ప్రతిరూపంగా తనభర్త అయిన రామకృష్ణ పరమ హంస చేతనే గౌరవింపబడిన ధన్యురాలు శారదామాత. ఆమె రామకృష్ణుని శిష్యులందరికీ కూడా తల్లియే. నివేదిత అక్కడ ఉండడానికి ప్రత్యేకమైన వసతి ఏర్పాట్లు లేవు. అందరితో బాటూ చాపలమీద పడుకోవడం, వ్రేళ్లతో భోజనం చేయడం, చన్నీళ్ల స్నానం చేయడం అలవరచుకొంది.

అక్కడి దినచర్యకు క్రమంగా అలవాటుపడసాగింది. తరువాత ఆమె బస శారదామాత గృహానికి ఎదురుగావున్న బోస్‌పారా వీధిలోని ఒక ఇంట్లోకి మారింది. నివేదిత శేషజీవితమంతా ఆ యింట్లోనే గడిచింది. రామకృష్ణ పరమహంస చేతనే 'గోపాలుని తల్లి'గా పిలువబడిన ఒక వృద్ధస్త్రీ ఈమె సహాయార్థము శారదామాతచే పంపబడింది. ఈమెను తల్లికంటే ఎక్కువగా ఆదరించింది నివేదిత. ఈమె మరణించినప్పుడు అంత్యక్రియలన్నీ తనే నిర్వహించింది.

ఈ యింట్లోనే తాత్కాలికంగా తన బాలికల పాఠశాలను ప్రారంభించి తన స్వప్నాన్ని సాఫల్యం చేసుకోవాలని నిర్ణయించుకుంది. నివేదిత భారతదేశం వచ్చిన పదినెలలకు నవంబరు, 13 వ తేదీన ఒక నిరాడంబర కార్యక్రామంతో పాఠశాల ప్రారంభమైంది. శారదామాత స్వయంగా కార్యక్రమానికి వచ్చి తన కరకమలాలతో కార్యక్రమాన్ని ప్రారంభించింది. భక్తితో ఆమె పాదాలకు మొక్కిన నివేదితను ఆమె అక్కున చేర్చుకొని కాళీ మాత దయతో ఈ పాఠశాలకు ఉజ్జ్వల భవిష్యత్ ఉంటుందని ఆశీర్వదించింది.

కేవలం ముగ్గురు బాలికలతో ప్రారంభమైన ఈ పాఠశాల దినదిన ప్రవర్థమానం చెందసాగింది. నివేదిత ఈ పాఠశాలను ఒక సవాలుగా స్వీకరించింది. కలకత్తా భాగ్ బజారులోని ఇంటింటికీ వెళ్లేది. ప్రతీ తలుపూ తట్టేది. తలుపు తీసినవారు ఆశ్చర్యపోయేవారు. తమ ముంగిట నిలచినది - తెల్లనిగౌను, మెడలో రుద్రాక్షలు, నుదుట విభూదితో మునికన్యలా ఉన్న ఒక పాశ్చాత్య వనిత!

వారికి నమస్కారం చేసి తాను రామకృష్ణాశ్రమపు సన్యాసినినని తన పేరు నివేదితనీ, పరిచయం చేసుకొని, బాలికల కొరకు తాము ప్రారంభించిన పాఠశాలకు వారి పాపలను పంపమని అభ్యర్థించేది. కొందరు మ్లేచ్ఛ స్త్రీ యని వ్యతిరేకించే వారు. కొందరు ముఖం మీదే తలుపు వేసుకొనే వారు. అయినా మొక్కవోని పట్టుదలతో తిరిగి పాఠశాల సంఖ్యను గణనీయంగా పెంచగలిగింది. ఆ బాలికలకు అల్లికలు, కుట్లు, చిత్రలేఖనం, కొందరు సన్యాసినుల సహాయంతో సంగీతం, మట్టి బొమ్మలు చేయడం నేర్పించేది. బెంగాలీభాష, గణితము కూడా నేర్పించేది.

క్రమంగా పాఠశాల గురించి అందరికీ తెలియసాగింది. శారదామాత కూడా తరుచు పాఠశాల గురించి తెలుసుకొని తన ఆశీస్సులనందజేస్తోంది. నివేదిత స్నేహితురాలైన కుమారి మేక్లెడ్ పాఠశాలను చూడడానికి వచ్చి అమాయకంగా ఉన్న ముకుళిత కలువల్లాంటి ఆ బాలికలను చూసి ఎంతో సంబరపడి వారితో ఆడుకుంటూ ఆ రోజంతా ఉండిపోయింది. దానితో ఆమె నివేదిత ఆర్థిక పరిస్థితిని కూడా అర్థంచేసుకొని నివేదిత వ్యక్తిగత జీవితానికి, పసిపాపల చిన్నచిన్న సౌకర్యాలకు అవసరమైన ధనసహాయం చేసింది.

నివేదిత బెంగాలీ నేర్పిన బ్రహ్మచారి ఇప్పుడు సన్యాస్రమంలో స్వామి సదానంద అయ్యారు. ఆయన కూడా పాఠశాల విషయం పట్టించుకొని సహాయపడుతూ వుండేవాడు. ధైర్యం చెబుతూ వుండేవాడు.

## ప్రత్యక్ష సేవాయజ్ఞం

1899 మార్చి బెంగాల్ చరిత్రలో రక్తాశ్రువులతో లిఖించదగ్గ సమయం. భయంకరమైన ప్లేగువ్యాధి బెంగాల్ ని కబళించింది. అందరు కలకత్తా విడిచి పారిపోతున్నారు. వెళ్ళలేనివారు భయంకరరోగం బారిని పడుతున్నారు. వివేకానందుడు వెంటనే తన శిష్యబృందాన్ని అవసరమైన సహాయకార్యక్రమాలకు సమాయత్తం చేసారు. ఆ బృందానికి సోదరి నివేదితను నాయకురాలిగా ప్రకటించారు. వెంటనే సేవాకార్యక్రమాలు ప్రారంభమయ్యాయి.

రోగం పెరగడానికి కారణం అపరిశుభ్రత. కనుక మురికినీ చెత్తనీ శుభ్రం చేయాలని ఆమె విజ్ఞప్తి చేసింది. అనేక ఆరోగ్య సూత్రాలను సామాన్యులకు అర్థమయ్యేరీతిలో ప్రచారం చేయించసాగింది. ఒకసారి దుర్గంధభూయిష్టమైన చెత్తతో నిండిన ఒక

వీధిని చూసింది. శుభ్రం చేయడానికి ఎవరో రావాలని ఎదురు చూడకుండా వెంటనే చీపిరి తీసుకొని శుభ్రపరచసాగింది. ఆమెను ఆ పనిలో చూసిన అనేకమంది యువకులు ముందుకు వచ్చి ఆ బాధ్యతను స్వీకరించారు. "ప్లేగువ్యాధి - యువకుల కర్తవ్యం" అనే అంశంపై యువకులకు ఉపన్యాసమిచ్చింది

భాగ్ బజారులోని మురికివాడలో ఒక పేదపూరిగుడిసెలో ఒక పాప ప్లేగు రక్కసికోరలకు చిక్కిందని తెలిసింది. భోజనం చేస్తున్న నివేదిత వెంటనే లేచి అక్కడికి పరుగుపెట్టింది. పాపకు తల్లికంటే ఎక్కువ సేవచేసింది. కాని ఆ పాప బ్రతకలేదు. గుండెలవిసేలా రోదిస్తున్న ఆ తల్లిని "మీ పాప జగజ్జనని కాళీమాత ఒడిచేరిందమ్మా" అని చెప్పి ఊరడించింది.

ఈ సహాయ సేవాకార్యాలని ఆమె ఒక పవిత్రయజ్ఞంలా స్వీకరించింది. స్వీయారోగ్యాన్ని కూడా లెక్కించకుండా పని చేసింది. చాలా రోజులు కేవలం పాలూ పండ్లతోనే భోజనం సరిపెట్టుకొనేది. ఒక్కొక్క రోజు అవీ ఉండేవి కాదు! ఇంత తీవ్రకృషి నివేదితకు మంచి పేరూ ప్రతిష్ఠా తెచ్చిపెట్టాయి. ఆమె సహచరులలోనూ, ఆమెకు ఆరాధ్యనీయమైన సమాజంలోనూ ఆమెకు సేవాతత్పరురాలిగా ఎనలేని గుర్తింపు వచ్చింది. ప్లేగు వ్యాధి సహాయతా కార్యాలపై తన నివేదికను సమర్పిస్తూ అప్పటి కలెక్టరు "సేవాకార్యక్రమాలలో ఎక్కడ చూసినా సోదరి నివేదితే దర్శనమిచ్చింది. ఈ సందర్భంగా ఆమె చేసిన సేవ మరువరానిది" అని వ్రాసారు.

ఇదే సమయంలో బెంగాల్‌లోని లబ్ధప్రతిష్ఠిత కుటుంబాలతో సాన్నిహిత్యం పెంచుకోసాగింది. వారిలో రవీంద్రనాథ్ ఠాగూర్, డా. జగదీశ్ చంద్రబోస్ మొదలైన వారున్నారు. వారిగురించి స్వామీజీతో చర్చించి వారితో ఎలా వ్యవహరించాలో

తెలుసుకొనేది.

## ఈ దేశము కొరకు విదేశాలకు

నివేదిత పాఠశాల ఉత్సాహభరితంగానే సాగుతోంది. కాని ధనలేమి ప్రభావం పాఠశాల నిర్వహణపై కనిపిస్తోంది. నివేదిత వైయక్తిక జీవనానికి కూడా ఇబ్బంది కలుగుతోంది. స్వామీజీ పరిస్థితి కూడా అలాగే ఉంది. రామకృష్ణా మఠం అభివృద్ధి అనుకున్నంతగా జరగటంలేదు. స్వామీజీనే నిరాశ ఆవరించింది. అనుకున్న పద్ధతులలో నిధి సేకరింపబడలేదు. ప్రణాళిక విజయ వంతమవుతుందో లేదో? ఆయన ఒకసారి నివేదితను సమీపించి "... నీ పాఠశాల బాగా జరుగుతోంది. నీవ్వూహించినరీతిలో నువ్వు విజయాన్ని పొందగలిగినట్లే. కాని మేము మా కర్త వ్యంలో విఫలమయ్యాము. ఈ ఆశల సౌధం కూలిపోకముందే ఇక్కడినుండి వెళ్లిపో, ఇప్పటికీ మించిపోయినదేమీ లేదు" అని చెప్పారు.

నివేదిత మనోబలమంతా నీరుకారిపోయే పరిస్థితి అది. మన సంతా కలచివేసినట్లు బాధపడింది. కానీ ఈ స్థితిని కూడా ఆమె గుండెనిబ్బరంతో ఎదుర్కొంది. స్వామీజీయేనా ఇంత బేలగా మాట్లాడుతున్నది? అనుకొంది.

"స్వామీజీ మనం స్వీకరించిన కార్యం అజేయమైనది. ఇది విఫలమవ్వడమనే ఆలోచనకే తావివ్వనవసరం లేదు. ఇది సమా జకార్యం. ఇది శ్రీ రామకృష్ణుల కార్యం. గురుమహారాజు కార్యం భగ్నమవుతుందా?" అని స్వామీజీతో మాట్లాడి ఊరడించింది. వీరిరువురూ చర్చించుకున్న పిదప, ఇక్కడి పరిస్థితులగురించి అమెరికా శిష్యులతో చర్చించిన తరువాత నిధిసేకరణకు మళ్లీ ఇంగ్లండు, అమెరికా వెళ్లాలని నిర్ణయించుకున్నారు. స్వామీజీ

ఆరోగ్యం కూడా బాగుండటంలేదు! వారికి విశ్రాంతి, గాలి మార్పు అవసరం అని వైద్యులు సూచించారు. విదేశీయానం వలన ఇదికూడా కలిసొస్తుంది!

1899 జూన్‌లో స్వామీజీతో కలిసి లండన్ ప్రయాణమయ్యింది నివేదిత. "స్వామీజీతో కలిసి ప్రయాణం చేస్తే ప్రతీ యాత్రా తీర్థయాత్ర అవుతుంది" అని ఒక స్నేహితురాలికి ఉత్తరం రాసింది నివేదిత. ఎందుకంటే స్వామీజీ ఎన్నో విషయాలను ఎంతో వివరంగా ఆమెకు విపులీకరించేవారు. ఆ విషయాలను ఎప్పటికప్పుడు 'టిప్పణి' రాసుకొనేది. స్వామీజీ వివిధ విషయాలపై మాట్లాడినట్లు నేడు మనకు లభిస్తున్న ప్రామాణిక ఆధారాలివే!

జూలై 31 వ తేదీన లండన్ చేరుకొన్న వీరికి నివేదిత తల్లి మేరీ నోబుల్ ఘనమైన స్వాగత సత్కారాలనేర్పాటుచేసింది. స్వామీజీ అనారోగ్యంతో బాధపడుతున్న విషయం తెలిసి అమెరికా శిష్యులు కూడా అక్కడకు చేరుకున్నారు. ఆ శిష్యులతో స్వామీజీ ఆగష్టు 16 న అమెరికా వెళ్లిపోయారు. నివేదిత లండన్‌లోనే ఉండిపోయింది. సోదరి వివాహాన్ని తన చేతులమీదుగా జరిపించింది.

ఆమె ఉన్నన్నిరోజులు తన స్నేహితులను, కుటుంబసభ్యులను స్వామీజీ ఇతర శిష్యబృందాన్నీ తన స్వీయానుభావాలతో, వివిధ హిందూ పురాణగాథలతో ముంచెత్తివేసింది. కృష్ణలీలామృతాన్ని, కాళీమాత శక్తితత్వాన్ని వారికి విపులంగా తెలియజేసింది.

సోదరి మే వివాహానంతరం ఒక్క క్షణం కూడా ఆలస్యం చేయకుండా నివేదిత అమెరికా బయలుదేరింది. తల్లి దుఃఖాన్ని, తమ్ముడి ప్రాధేయతలను పట్టించుకోలేదు. ఆమె ఇప్పుడు

పూర్తిగా సర్వసంగ పరిత్యాగి. శారదామాత రూపంలోనున్న భారతమాత ఆమె తల్లి. భారతదేశపు వేలాది దుఃఖజనులు! ఆమె సోదరీ సోదరులు.

అమెరికాలో స్వామీజీని కలుసుకొంది. స్వామీజీ అనారోగ్యం తీవ్రమయ్యింది. తీవ్రమధుమేహం, ఉబ్బసం, ఆయనలోని ఉత్సాహాన్ని సగానికి తగ్గించివేసాయి. అప్పటికింకా 'ఇన్సులిన్' మందు కనుగొనబడలేదు. స్వామీజీ అలాగే కొంతమంది అమెరికా శిష్యులకు సన్యాసం ప్రసాదించి ఫ్రాన్సు వెళ్లిపోయారు. నివేదిత తన పాఠశాలకు నిధి సేకరించడానికై ఉండిపోయింది.

అమెరికాలో నిధిసేకరణ ఆమె అనుకున్నంత సులభంగా జరుగలేదు. అమెరికా సాధారణ మధ్యతరగతి ప్రజలు ఆమె భావాలకు స్వాగతం పలికినా ధనరూపేణా ఎక్కువ ప్రయోజనం కలుగలేదు. ఉన్నత వర్గంవారు నిర్లిప్తంగా ఉండేవారు. అన్ని పట్టణాలనూ క్రమంగా పర్యటించసాగింది. ఉన్నతవర్గాల లోని ఉదాసీనతా విషవలయాన్ని ఛేదించడంలో చివరకు సఫలం అయ్యింది. చికాగోలో ఒక మహిళాసంస్థ "ఆంగ్లో శాక్సన్" సంస్కృతిపై నిర్వహిస్తున్న గోష్ఠి వినడానికి సహచరుల బలవంతంపై వెళ్లింది. గోష్ఠిలో పాల్గొనవలసిందిగా శ్రోతలను కూడా ఆహ్వానించారు. ఆ అవకాశాన్ని నివేదిత సద్వినియోగపరచుకొంది. ఆమె ప్రసంగం సభికులను విశేషంగా ఆకట్టుకొంది. మరొక వివేకానందాయే అయ్యింది.

ఆ తరువాత ఆమె అనేక సభలలో సమావేశాలలో పాల్గొంది. హిందూ స్త్రీలకొరకు ప్రారంభించిన హిందూ సంస్థకు విరాళమీయవలసిందిగా ఆమె విజ్ఞప్తి చేసేది. చిన్నచిన్న మొత్తాలు ఇచ్చేవారిని ప్రోత్సహించేది. నాలకొక డాలరుచొప్పున పదిసంవత్సరాలపాటు ఇచ్చేలా కొందరు దాతలతో మాట్లాడింది. 'నివేదిత

పరస్పర సహాయతా సంస్థ' అనే సంస్థను ప్రారంభించింది.

అప్పటి అమెరికా వార్తాపత్రికలు నివేదితను ఆకాశానికి ఎత్తేసాయి. వివేకానందుని నోట్లోంచి ఊడిపడ్డ ఆయన శిష్యురాలిగా ఈమెకు మంచి ప్రాచుర్యం లభించింది.

## పదహారణాల భారతీయత

అక్కడినుండి భారతదేశం బయలుదేరదామనుకొనే సమయంలో సారాబుల్, మేక్లౌడ్‌ల ప్రోద్బలంపై ఫ్రాన్సు వెళ్లింది. అక్కడ స్వామీజీని కలిసింది. స్వామీజీ ఆరోగ్యం కొంచెం మెరుగైనట్లుంది అనుకొన్నది. స్వామీజీ ఆమె అమెరికా ప్రవాసం గురించి అసలు మాట్లాడలేదు. ఇది ఆమెకు బాధను కలిగించింది. ఆమె ఇప్పుడు పదహారణాల హిందూ వనితగా రూపాంతరం చెందింది.

అందుకే ఫ్రాన్సులో మహిళా శిష్యులవలన స్వామీజీ ప్రతిష్ఠ ఏమైనా దెబ్బతింటుందేమోనని భయపడింది. అదేవిషయాన్ని స్వామీజీతో చెప్పింది. దానితో స్వామీజీ ఆమెతో గంభీరంగా "అద్వైతంలో మంచికీ చెడుకీ తేడాలేదు. నీకింకా అద్వైతభావన అర్థమవ్వలేదన్నమాట. దీనికి నీవింకా సాధనచేయాలి" అన్నారు. నివేదిత చాలా బాధపడింది. తానింక స్వామీజీ ప్రభావంలో ఉండకూడదు. తన సేవా సాధనను తన స్వంతంగా చేసుకోవాలి అని నిర్ణయం తీసుకొని తనకు కలిగిన ఆ మానసిక సంఘర్షణనుండి సేదదీర్చుకోడానికి మళ్లీ లండన్ బయలుదేరింది. లండన్ చేరాక తన ఆలోచన తనకే హాస్యాస్పదమనిపించింది. మళ్లీ స్వామీజీకి ఉత్తరం వ్రాసింది. బ్రిటన్‌లో నిధిసేకరణ పూర్తిచేసుకొని భారతదేశం వస్తానని.

నివేదిత మళ్లీ లండన్ వచ్చింది. ఆమె కొంతకాలం లండన్ లోనే ఉండి, పాఠశాల కొరకు విరాళాలు సేకరించే ప్రయత్నం చేసింది. ఆ సమయంలో అక్కడ డా. జగదీశ్ చంద్రబోస్ దంపతులున్నారు. బోస్ వృక్షశాస్త్రజ్ఞుడు. మొక్కలలోని ప్రాణ స్పందనపై పరిశోధనలు చేస్తున్నారు. ఆయన కుటుంబంతో నివేదితకు మంచి సాన్నిహిత్యం ఏర్పడింది.

భారతదేశంలో పూర్తిగా భారతీయులచే భారతీయులకొరకు ఒక విజ్ఞానశాస్త్ర విశ్వవిద్యాలయం ఏర్పాటుచేయాలనే ప్రయత్నంలో ప్రముఖ పారిశ్రామికవేత్త జమ్ షెడ్ జీ టాటా లండన్ వచ్చి ఉన్నారు. ఆయన ప్రణాళికను ఆంగ్లేయులు ఒప్పుకోవడం లేదు. నివేదిత ఈ వివాదంలో కలగజేసుకొంది. దీనిని ప్రజల దృష్టికి ప్రభుత్వం దృష్టికి తీసికొని వెళ్లే ప్రయత్నం చేసింది.

ఇంగ్లండ్ లో ఉంటూ భారతీయులకు భారత చరిత్ర, ఆర్థిక సామాజిక విషయాలపై శిక్షణనిస్తున్న ప్రముఖ సామాజిక శాస్త్రవేత్త రమేశ్ చంద్రదత్ తో కూడా పరిచయం పెంచుకొంది. ఆయనవద్ద చరిత్రను క్షుణ్ణంగా అధ్యయనం చేసింది. ఆయన ప్రోద్బలంతోనే (Web of Indian Life) "చిక్కుముళ్ల భారతీయ జీవనం" అనే గ్రంధాన్ని రచించింది. హిందూ సమాజంలో మహిళకున్న ఉన్నతస్థానాన్ని ఈ పుస్తకంలో విపులంగా చర్చించింది.

వివిధ భారత సామాజిక, ఆర్థిక విషయాలపై స్థానిక పత్రికలలో అనేక వ్యాసాలు వ్రాసింది. అదేసమయంలో తన పాఠశాలకై నిధిసేకరణ ఉద్యమాన్ని కొనసాగించింది. అయితే వివిధ విషయాలను, రాజకీయాలను కూలంకషంగా పరిశీలించిన తరువాత "హిందూ మహిళను ఉద్ధరించాలి అంటే ఈ పాఠశాల ఒక్కదానితోనూ సరిపోదు. మొదట హిందూ సమాజం మొత్తాన్ని

జాగృతం చేయాలి. హిందూ సమాజంపై, భారత రాజకీయాలపై జాతీయత ప్రభావం పడేలా కృషిచేయాలి.... ఒక ఇరువది సంవత్సరాలలో ఆంగ్లేయులకు నిజమైన హిందుత్వమేమిటో రుచి చూపించాలి. మేము స్వతంత్రులమయ్యామని ఎలుగెత్తి చాటగలిగే ధైర్యం మాకు (భారతీయులకు) రావాలి" అనే తన భావాలను సహచరి మేక్లెడ్‌కు ఉత్తరంగా వ్రాసింది.

భారతీయ నాయకులందరూ కలలోకూడా స్వతంత్రాన్ని ఊహించనిరోజుల్లో, భారతీయులకంటె ఎక్కువ భారతీయురాలిగా ఈవిధంగా ఆలోచించడం ఆమె గొప్పతనం. ఇటువంటి భావాలతో, ఆమె అణువణువూ భారతమాత రూపాన్ని, ప్రతిబింబిస్తున్నాయి. హిందూ సమాజంతో ఆమె మమేకం చెందింది. ఆమె ఆశించినట్లుగానే మరొక 20 సంవత్సరాలలోనే హిందూ సమాజ సంఘటనకు, జాగరణకు, స్వాభిమాన నిర్మాణానికి కృషి ప్రారంభమైంది రాష్ట్రీయ స్వయంసేవక సంఘ రూపంలో!

# స్వదేశానికి

సుమారు మూడు సంవత్సరాల ఎడబాటు తరువాత 1902 ఫిబ్రవరిలో మళ్లీ తల్లి ఒడి చేరింది నివేదిత. భారతదేశం తిరిగి వచ్చింది. మొదటిసారి ఈ గడ్డపై అడుగుపెడుతున్నప్పుడు ఉండే భయం స్థానాన్ని స్వాభిమానం ఆక్రమించింది. ఆహారం కోసం ఆకసంలో సుదూరతీరాలు ఎగురుకుంటూ వెళ్లి సంధ్యా సమయానికి గూడు చేరుకుంటున్న పక్షిలా ఉంది ఆమె మనసు. ఇప్పుడామె ఎక్కడైనా మాట్లాడుతూ "మా సంస్కృతి, మా సమాజం, మా అలవాట్లు, మా ఆచారాలు- అన్నది అంటే అవన్నీ, హిందూ సంస్కృతి, హిందూ సమాజం, హిందువుల అలవాట్లు, గురించి మాట్లాడుతున్నట్లే అర్థంచేసుకోవాలి.

భారతదేశం వస్తూనే అనారోగ్యంతో బాధపడుతున్న స్వామీజీ క్షేమసమాచారాలు తెలుసుకొంది. వెంటనే తన స్వగృహానికి వెళ్లింది. తన బాలికల పాఠశాల పనిని ప్రారంభించింది. అయితే పని మళ్లీ మొదటికొచ్చింది. పిల్లలను సేకరించడానికి ఎంతో కష్టపడవలసి వచ్చింది. పాఠశాల ప్రారంభించేముందు బస్తీలోని స్త్రీలందరినీ ఆహ్వానించి సరస్వతీపూజ ఏర్పాటుచేసింది.

ఈ విషయం స్వామీజీకి ఉత్తరం ద్వారా తెలియజేసింది. బెనారస్‌లో ఉన్న స్వామీజీ వెంటనే తమ ఆశీస్సులను అంద జేసారు. పాఠశాల పనిలో నివేదితకు సహాయపడడానికి అమెరికా నుండి సోదరి క్రిస్టీన్ గ్రీన్‌స్టైడల్ వచ్చి, ఈమెకు చేదో డువాదోడుగా ఉండసాగింది. ఆమె సహాయంతో మహిళలకు వేరేతరగతి ప్రారంభించింది నివేదిత. చిన్నపాపలతోపాటు వారి తల్లులు కూడా పాఠశాలకు వచ్చేవారన్నమాట! వారికి కూడా చదవడం, వ్రాయడం, చిత్రలేఖనం, కుట్లు, అల్లికలు మొదలై

నవి నేర్పేవారు. శారదామాత కూడా పునఃప్రారంభం తరువాత ఒకసారి పాఠశాల సందర్శించి ఆశీస్సులు ఇచ్చివెళ్లింది.

## ఆఖరి ఆశీస్సులు

విదేశీ ప్రయాణం, ఆ తరువాత భారతదేశంలో ఎడతెరిపి లేని పర్యటనా ప్రసంగాలూ, వివేకానందుని ఆరోగ్యాన్ని బాగా దెబ్బతీసాయి. తీవ్రమధుమేహంతో, ఉబ్బసంతో బాధపడుతున్న ఆయనకు అత్యంత అవసరమైన విశ్రాంతి కరువైంది. శిష్యులు బలవంతంమీద మందులు సేవిస్తూ, బేలూరు మఠంలో విశ్రాంతి తీసుకోసాగారు. జూన్ 28 వ తేదీన స్వామీజీ స్వయంగా నివేదిత నడిపే పాఠశాలకు వెళ్లారు. నివేదిత లోనికి తీసికొని వెళ్లి, "గుండె కుదిలించి నీముందు కుప్పవోతు అందుకోవయ్యా హృదయ పుష్పాంజలులను" అన్నట్లు పరిచర్యలు చేసింది.

స్వామీజీ ఆమెను "ఈ చిన్నారి పాపలలో జగజ్జననిని చూడడం మరువకు" అని ఆశీర్వదించి "ఒకసారి బేలూరు మఠానికి వచ్చి నీ భవిష్య ప్రణాళికల గురించి మఠంలోని శిష్యులందరికీ వివరించు"మని ఆహ్వానించి వెళ్లిపోయారు.

వారు చెప్పినట్లే జూలై రెండవ తేదీన నివేదిత బేలూరు మఠం వెళ్లి తన భవిష్యత్ కార్యప్రణాళికను గూర్చి వివరించింది. మధ్యలో స్వామీజీ కొన్ని ప్రశ్నలు వేసారు కూడా! అంతా అయిన తరువాత ఆయన తన గదిలోకి వెళ్లిపోయారు. ఎందుకో ఒక్కసారి ఒంటరితనం ఆవహించినట్లు బాధపడింది నివేదిత. ఇంతలో స్వామీజీనుండి పిలుపు వచ్చింది గదిలోకి రమ్మని.

ఆవేళ ఏకాదశి. స్వామీజీ ఉపవాసం ఉండేరోజు. కాని

అక్కడ విస్తట్లో పదార్థాలు వడ్డించి ఉన్నాయి. ఆయన నెమ్మదిగా సంజ్ఞచేసి కూర్చోమన్నారు. దగ్గర కూర్చుని అవన్నీ ఆమెకు తినిపించారు. తరువాత ఆయన స్వయంగా ఆమె చేతులు కడిగి శుభ్రంచేసారు. నివేదితకు ఇవేమీ అర్థమవ్వడంలేదు. ఇంక ఉండబట్టలేక "స్వామీజీ ఇవన్నీ నేను మీకు చేయాలి శిష్యురాలికి గురువు చేయడం బాగాలేదు" అని గట్టిగా చెప్పేసింది.

స్వామీజీ తన సహజమయిన అమృతమయ మందహాసంతో "యేసుక్రీస్తు కూడా తన శిష్యులకిలాగే చేసాడు కదా!" అని చెప్పారు. "కానీ అదెప్పుడో తెలుసా? ఆయన చివరి...." నివేదిత గట్టిగానే చెప్తున్నాననుకొంది. కానీ చెప్పలేకపోయింది. మాటలు గొంతులోనే ఉండిపోయాయి. గుండె వెళ్లనని మొరాయిస్తున్నా, కర్తవ్యం గుర్తుకొచ్చి, స్వామీజీనుండి ఆశీస్సులు తీసుకొని తన నివాసానికి వెళ్లిపోయింది.

స్వామీజీ తన ఆరోగ్య సమాచారాన్ని 3 వ తేదీన, నాలుగవతేదీన కూడా శిష్యులచే ఆమెకు తెలియజేసారు. 5 వ తేదీ ఉదయమే బేలూరు మఠం నుండి శిష్యుడొకాయన వచ్చి నివేదితకు ఉత్తరము ఒకటి ఇచ్చాడు. ఉత్తరం అందుకుంటూనే "స్వామీజీ ఎలా ఉన్నారు" అని అడిగి, ఉత్తరం చదివి ఒక్కసారిగా కూలబడిపోయింది.

ఉత్తరంలో స్వామీజీ సదానంద వ్రాసారు "సోదరీ స్వామీజీ మనకికలేరు. నిన్న రాత్రి దీర్ఘసమాధిలోకి వెళ్లిపోయారు!" అని.

ఆమె వెంటనే ఆశ్రమానికి వెళ్లింది. స్వామీజీ పార్థివదేహానికి శూన్యమావరించిన మనసుతో, మధ్యాహ్నం వరకూ విసురుతూ ఉండిపోయింది. అంతిమయాత్రలో కూడా పాల్గొంది. స్వామీజీ ముందే సూచించిన స్థలంలో ఆయన దేహానికి అంతిమ సంస్కారం జరిగింది.

ఆమె దూరంగా ఒక చెట్టుక్రింద కూర్చుని పంచభూతా లలో కలిసిపోతున్న ఆ పరివ్రాజకుని పార్థివదేహాన్ని చూస్తూ ఉండిపోయింది. ఆమరణాంతం నీవెంట ఉంటాననే స్వామీజీ మాటలు ఆమె గుండెలోయల్లో ప్రతిధ్వనిస్తున్నాయి. ఇంతలో స్వామీజీ దేహంపై కప్పిన కాషాయ వస్త్రంలో సగంకాలిన భాగమొకటి ఆ అగ్నిజ్వాలలనుండి ఎగసివచ్చి నివేదిత ఒడిలో పడింది. అది గురువర్యుని అంతిమ ఆశీఃప్రసాదముగా భావించి కళ్లకద్దుకొని దానిని ఆమె ఎంతో భక్తితో స్వీకరించింది.

ఆమె గట్టిగా రోదించాలనుకొంది. కాని దుఃఖించడం స్వామీజీ తత్వానికి వ్యతిరేకం ఇప్పుడే ధైర్యం తెచ్చుకోవాలి. "స్వామీజీ మీరిచ్చిన ధైర్యంతో మీ కార్యాన్ని పూర్తిచేస్తాను. ఇంక ఒక్కక్షణం కూడా వృధాచేయను" అని దృఢసంకల్పం చేసు కుంటూ తనను తాను సముదాయించుకొంది. ఆమె ముఖంలో ఇప్పుడు పట్టుదలతో కూడిన కార్యదీక్ష కనబడుతోంది." ఉత్తిష్ఠ, జాగృతః ప్రాప్యవరాన్ని బోధత" అనే స్వామీజీ సింహగర్జన ఆమె చెవులలో మార్మోగుతోంది.

బుద్ధుడవై సుషుప్తుల ప్రబుద్ధుల జేయుము శాంతి సత్యధ
ర్మోద్ధరణార్థమై బ్రతుకునొగ్గుము, మానవ సంఘసేవయే
సిద్ధికి త్రోవ, వత్సలత చిందెడి ప్రేమసుధాస్రవంతులన్
శుద్ధమొనర్పుము జ్వాల యశోధర జర్జరిత ప్రపంచమున్

-కరుణశ్రీ

## విస్తరించిన కార్యపరిధి

"స్వామీజీ మరణించారని ఎవరన్నారు. ఆయనెప్పుడూ మన

తోనే ఉంటారు. ఇది వాస్తవం. అందుకే నాకు దుఃఖం కూడా రావటంలేదు" కుమారి మేక్లెడ్‌కు వ్రాసిన ఉత్తరంలో నివేదిత వెలిబుచ్చిన భావాలు ఇవి. "హిందూ దేశ మానాభిమానాలే తమ మానాభిమానాలుగా భావించి నిస్వార్థులుగా నిష్కామ కర్మ చేసే యువకులలో చూస్తే గురువర్యులు మనకు దర్శనమిస్తారు" అని కూడా వ్రాసింది. స్వామీజీ ఏ లక్ష్యంతో ఈ నివేదితను పెంచారో ఆ లక్ష్యసాధనకు ఆ జీవనము కృషిచేస్తాను అని తీవ్రప్రతిజ్ఞ తీసుకుంది.

అందుకే తన భవిష్యత్ కార్యక్రమం కేవలం తన పాఠ శాలలోనే ముడుపెట్టుకోకుండా నివేదిత తన కార్యపరిధిని అనంతంగా విస్తరించుకుంది. భారతదేశ ఆధ్యాత్మిక, రాజకీయ స్వాతంత్ర్య సముపార్జన ఆ పరిధికి కేంద్రబిందువు.

రాబోయే రోజుల్లో తాను విధిగా రాజకీయ కార్యకలాపా లలో తీవ్రంగా పాల్గొనవలసి వస్తుందని నివేదితకు తెలుసు. తన కార్యక్రమాల ప్రభావం రామకృష్ణమఠంపై పడకూడదని నిర్ణయించుకుంది. అందుకే మఠం నుండి ఆమె నమ్రతతో రాజీనామా చేసింది. రాజీనామా పత్రంపై సంతకం చేస్తూ - "రామకృష్ణా వివేకానందుల నివేదిత" అని వ్రాసింది. ఈ సంతకము వివాదాస్పదమైంది. తాను వ్యావహారికంగా రామకృష్ణ మఠంనుండి దూరమైనా ఎల్లప్పుడు రామకృష్ణాశ్రమ పరంపరలోని నైష్ఠిక బ్రహ్మచారిణినే అనే విషయం ప్రస్థాపితం చేసుకోడానికి అలా చేసానని వివరణ ఇచ్చింది. తరువాత జీవితాంతం ఎప్పుడు సంతకం చేసినా ఆ విధంగానే చేసేది.

ఇంక ఇప్పుడు నివేదిత ఆలోచనలన్నీ భారతదేశం గురించి, ఊహలన్నీ భారతీయుల గురించి వ్రాతలన్నీ భారతీయత గురించి. ఆమె శ్రద్ధాకేంద్రం భారతమాత. "ఇక నా ఆద్యంతాలూ భార

తదేశమే' 'నని తన రాజీనామా లేఖలో స్వామీ బ్రహ్మానందకు వ్రాసింది. ఆంగ్లేయులు భారతదేశంలో ఎటువంటి అనాగరిక దమనకాండకు పాలుపడుతున్నారో గమనించి ఆవేదనచెందింది. శ్రీమతి సారాబుల్ కి వ్రాసినలేఖలో "నేను శ్వేత జాతియురాలినైనందుకు సిగ్గుపడేలా ఉంది. ఇక్కడ ఆంగ్లేయుల పాలన" అని వ్రాసింది. "నా కంఠంలో ప్రాణమున్నంత వరకూ, నా గురించి ఎవరు ఏమనుకున్నా సరే దీనికి వ్యతిరేకంగా పోరాడి తీరుతాను" అని కుమారి మేక్లైడ్ కి వ్రాసిన ఉత్తరంలో స్పష్టం చేసింది.

## తక్షణ కర్తవ్యం

స్వామీజీ మరణానంతరం ఉత్పన్నమైన శూన్యతను తిరిగి ఆయన సిద్ధాంత తరంగాలతో నింపడం తక్షణ కర్తవ్యంగా భావించింది నివేదిత. దేశంలోని ముఖ్యపట్టణాలు పర్యటించి స్వామీజీ జీవనసందేశాన్ని చాటాలని నిర్ణయించుకొంది. వెంటనే బొంబాయి పయనమయ్యింది. బొంబాయిలో అనేక సభలలో మాట్లాడింది. అనేకమంది యువకులు ఆమెచే ఆకర్షితులైవారు. "మేము మా జీవితాలను సార్థకపరచుకోవడమెలా?" అనే యువకుల ప్రశ్నకు "ఏదో ఒక పద్ధతిలో దేశానికి సేవచేయండి. దానికి ముందుగా మీరు నావలె మీ వ్యక్తిగత బంధనాల నుండి బయటపడండి" అని ఆమెనుండి సమాధానం లభించేది. ఆరు వారాలలో లాహోర్, సూరత్, బరోడా, వార్ధా, నాగపూర్ పట్టణాలను పర్యటించింది.

బరోడాలో ఆమె అరవిందఘోష్‌ని కలుసుకుంది. విప్లవకారుడై యోగీశ్వరునిగా జీవితం చాలించిన ఈ యోగిపుంగవుని జీవితంపై నివేదిత ప్రభావము ఎంతైనా ఉంది. పత్రికలలో వ్యాసాల

ద్వారా ఒకరినొకరు ఇంతకుముందే తెలుసుకొని ఉన్నారు. వెంటనే కలకత్తా వచ్చేయమని, "కలకత్తా నీకొరకు ఎదురుచూస్తోంది" అని అరవిందుని కోరింది. దక్షిణ భారతదేశంలో కూడా ఆమె పర్యటించింది. 1903 జనవరిలో కలకత్తా చేరుకొనేసరికి ఆమె శరీరమంతా నూతనోత్తేజంతో నిండివుంది.

పాఠశాల పనిని శ్రద్ధగా పట్టించుకుంటూనే, అధిక సమయం రాజకీయ జాతీయ ఉద్యమాలలో పాల్గొనగలుగుతోంది. అనేక మంది ప్రముఖ నాయకులతో పరిచయం ఏర్పరచుకుంది. అప్పటికే దేశ రాజకీయ వాతావరణం వేడెక్కుతోంది. ఆంగ్లేయ ప్రభుత్వంపై కొందరు నాయకులు పెట్టుకొన్న ఆశలు అడియాసలని తేలిపోవడంతో వారు కూడా ఆంగ్ల వ్యతిరేకోద్యమంలో భాగస్వాములయ్యారు. తన పత్రికారచనల ద్వారా నివేదిత అటువంటి వారికి స్పష్టమైన దిశాదర్శనం చేసేది. అనేక సామాజిక రాజకీయ విషయాలపై విమర్శనాస్త్రాలను సంధిస్తూ వ్రాసిన వ్రాతలవలన ఆమె అనేకమంది తలలో నాలుకయ్యింది. 1905 వ సంవత్సరానికి ఆమె బెంగాల్ స్వాతంత్ర్య పోరాటంలో విడదీయరాని భాగమైపోయింది.

## వందేమాతరం

ఇదే సమయంలో పులిన్ బిహారీదాస్ వంగప్రాంతంలో 'అనుశీలన సమితి' అనే రహస్య విప్లవకారసంస్థను ఏర్పరిచారు. యువకులను సమీకరించి ఆంగ్లేయులపై సాయుధ పోరాటం చేయడం దీని ఉద్దేశం. నివేదిత ఈ సమితి కార్యక్రమాలను చాలా శ్రద్ధగా పరికిస్తూ ఉండేది. పులిన్ బిహారీదాస్‌తో మంచి స్నేహాన్ని ఏర్పరచుకుంది. సమితి సభ్యులెవరైనా పట్టుబడిపోతే

బాధతో విలవిలలాడేది. విప్లవపంథా అనేకమంది యువకులనా కర్షించింది. విప్లవసంస్థలు కూడా అనేకం పుట్టుకురానారం భించాయి. అప్పటికి ఇంకా బరోడాలోనే ఉన్న అరవిందుడు ఈ స్థితిని గమనించాడు. ఈ విప్లవసంస్థలన్నీ సంఘటితమై ఏకత్రాటిపై పనిచేస్తే ప్రభావవంతంగా ఉంటుందని భావించి విప్లవసంస్థల సహయోగి సమితిని ఏర్పరిచాడు. ఈ సమితిలో ఐదుగురు సభ్యులు ఉండేవారు. వీరిలో నివేదిత ఒకరు. మిగిలి నవారు శ్రీ పి.మిత్ర, న్యాయవాది విప్లవ నాయకుడు, జోతిన్ బెనర్జీ, చిత్తరంజన్ దాస్, సురేంద్రనాథ్ ఠాగూర్.

యువకులను సమీకరించడం, వారికి శారీరక, బౌద్ధిక్ శిక్షణ నివ్వడం, ఆయుధ ప్రయోగం నేర్పడం ఈ సహయోగి సమితి బాధ్యతలు. కానీ ఈ సమితి అనుకున్నంత ప్రభావవంతంగా పనిచేయలేదు. అరవిందుడు అప్పటికింకా బరోడాలో ఉండిపోవ డమే దీనికి కారణం. కనుక నివేదిత అనుశీలనసమితితో ప్రత్యక్ష సంబంధం ఏర్పరచుకొంది. రాస్ బిహారీఘోష్, చిత్తరంజన్ దాస్ లతో కలిసి ఈ సమితి కార్యక్రమాలను సమన్వయపరచసాగింది. ఆ తరువాత రోజుల్లో రాష్ట్రీయ స్వయంసేవక సంఘ సంస్థాప కులైన డా. హెడ్గేవార్ కలకత్తాలో వైద్యవిద్యనభ్యసించే తరుణంలో ఈ అనుశీలన సమితిలో సభ్యులుగా ఉండేవారు.

నివేదిత స్వయంగా శక్తి ఆరాధకురాలు. రామకృష్ణాశ్రమ పరంపర గనుక నిత్య శివపంచాక్షరీ జపంతోబాటు కాళీమా తను కూడా అత్యంత భక్తిశ్రద్ధలతో కొలిచేది. అది ఏదో కేవలం దేవ్యారాధనగానేగాక శక్తి ఆరాధనగా ఆమె భావించింది. 'కాళీమాత' అనే పుస్తకాన్ని కూడా రచించింది. అందువలన సమాజాన్ని నిర్వీర్యపరిచే అహింసాభావనలు ఆమెకు వంటబట్ట టంలేదు. స్వాతంత్ర్యసముపార్జనకు హింసాప్రయోగం తప్పలేదని

ఆమె భావన. ఈ వాదనకు బలం చేకూర్చుకోడానికి ఆమె 1850 నాటి ఐరిష్ స్వాతంత్ర్య పోరాట గాధలను పత్రికలలో వ్రాసేది.

ఇంతలో గంగాసాగరంనుండి ఉవ్వెత్తున ఎగసిపడింది. వందే మాతరం ఉద్యమం. లార్డ్ కర్జన్ పుణ్యమా అని బెంగాల్ అంతా స్వాభిమాన జాతీయతరంగాలు వ్యాప్తిచెందాయి. జూలై 20 వ తేదీన ప్రకటింపబడిన బెంగాల్ విభజన చట్టానికి వ్యతిరేకంగా దేశ ప్రజలందరూ ఏకత్రితమయ్యారు. వారి హృదయాలలో 'వందే మాతర' నినాదం తారకమంత్రమే అయింది. ఆగష్టునెలలోనే సురేంద్రనాధ్ బెనర్జీ అఖండబెంగాల్ స్మృతిచిహ్నంగా కలకత్తాలో ఫెడరేషన్ హాల్ నిర్మించాలని కోరుతూ ప్రజా ఉద్యమం నిర్వహించాడు. దీనిలో నివేదిత ఉత్సాహంగా పాల్గొంది. ఆయన వ్రాసిన 'ఎ నేషన్ ఇన్ ది మేకింగ్' అనే పుస్తకంలో నివేదిత సేవలను ఎంతగానో కొనియాడారు.

వందేమాతరాన్ని నివేదిత తన పాఠశాలలో ప్రవేశపెట్టింది. ప్రభుత్వ నిషేధ సమయంలో కూడా వందేమాతరం గానం చేయడాన్ని ఆమె తప్పనిసరిచేసి తన శ్రద్ధను ప్రకటించుకుంది.

ఆ సంవత్సరం వారణాశిలో జరిగే అఖిల భారత కాంగ్రెస్ మహాసభలకు రావలసినదిగా నివేదితకు ఆహ్వానమందింది. సభల తీర్మానాలు వ్రాయడానికి సభావివరాలను పత్రికలకు పంపడానికి నాయకుల ప్రకటనలు తయారుచేయడానికి ఆమె పాధికార విలేఖరిగా బాధ్యత తీసుకుంది. సభలకు దగ్గరలోనే ఒక ఇల్లు అద్దెకు తీసుకుంది. ఎంతో నిరాడంబరంగా ఉన్న ఆ యింటికి అనేకమంది జాతీయనాయకులు వస్తూపోతూ వుండేవారు. ఆవేళ జరిగిన కార్యక్రమాల సమీక్ష జరిగి, మరునాటి చర్చనీయాంశాలను నిర్ణయించడం ఆమె సమక్షంలోనే జరిగేవి.

వారణాశి కాంగ్రెస్ సభలలోనే అతివాదులు మితవాదులపై తమ ఆధిక్యతను స్థిరపరచుకుంటూ బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదింపజేసారు. తిలక్, బిపిన్‌చంద్ర పాల్ మొదలైన నాయకులతో ఆమెకు సాన్నిహిత్యమేర్పడింది ఈ సభలోనే.

మితవాద నాయకుడైన గోపాలకృష్ణగోఖలేతో కూడా నివేదితకు మంచి సాన్నిహిత్యమేర్పడింది. గోఖలే ప్రారంభించిన 'సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ' ఆయన మితవాద భావాల నుండి కొంత బయటకు వచ్చారన్నదానికి నిదర్శనం. యువకులను సమీకరించి వారికి సైనిక శిక్షణనివ్వడం వారిని దేశభక్తులుగా తీర్చిదిద్దడం ఈ సొసైటీ ఉద్దేశం. ఈ సొసైటీకి ఆ పేరు నిర్ణయించడంలోనూ, ఆ సంస్థ నామౌచిత్యాన్ని ప్రస్ఫుటపరచడంలోనూ, సంస్థ నియమ నిబంధనలను తయారుచేయడంలోనూ ఈమె పాత్ర ఎంతైనా ఉంది.

కాంగ్రెస్‌లో తలెత్తిన ఈ మితవాద, అతివాద విభేదం నివేదితకు మనస్తాపం కలిగించింది. 1906 లో కలకత్తా కాంగ్రెస్‌లో కూడా పాలుపంచుకొంది. అప్పటి దేశ పరిస్థితులకనుగుణంగా తీవ్ర జాతీయవాదుల ప్రభావం కాంగ్రెస్ నాయకత్వంలో పెరగాలనే ఆమె కోరిక 1907 సూరత్ కాంగ్రెస్ సమావేశంలో తీరింది. అరవిందుడు బిపిన్‌చంద్రపాల్‌తో చేతులుకలిపి అతివాద కాంగ్రెస్‌కి నాయకుడైనాడు.

అరవిందుడు విప్లవకార్యాలలో ప్రత్యక్షంగా పాల్గొనడం మొదలుపెట్టాక నివేదిత కూడా అనుశీలన సమితితో, అరవిందునితో తన పనిని పెంచుకొంది. యువకులకు ఆధునిక గెరిల్లా యుద్ధ పద్ధతులు నేర్పాలని ఆమె నాయకులతో వాదించేది. ఆమె ప్రోద్బలం, ప్రోత్సాహం చేతనే యువకులు బాంబులు

తయారుచేడయంలో శిక్షణపొందారు. డా.జగదీశ్ చంద్రబోస్, పి.సి.రాయ్‌లు పనిచేసే ప్రెసిడెన్సీ కళాశాలలోని వారి ప్రయోగశాలల్లో యువకులను సహాయకులుగా, పనివారుగా ప్రవేశపెట్టి వారికి ఆ శిక్షణ లభించేలా చూసింది. ఆలీపూర్ కుట్రకేసులో ప్రాధాన్యత సంతరించుకున్న మురార్పుకూర్ రోడ్ లేబరేటరీలో బాంబులు తయారుచేయడంలో కూడా ఈమె పాత్ర ఉన్నట్లు తెలుస్తోంది. ప్రభుత్వం ఈ లేబోరేటరీని స్వాధీనం చేసుకుంది. నివేదితపై ప్రభుత్వ నిఘా ఉధృతంగా ప్రారంభమైంది. ఆమె గానీ ప్రభుత్వానికి దొరికితే దేశబహిష్కరణకు గురికావచ్చునని ప్రభుత్వంలోని సన్నిహితులద్వారా తెలిసింది. అవసరమైన జాగ్రత్తలు తీసికొంది.

# అతులిత జాతీయవాది

"వేదాలలోను ఉపనిషత్తులలోను, ప్రాచీన సామాజిక సాంప్రదాయాలలోను మహాసామ్రాజ్యాల నిర్మాణంలోనూ ఉత్పన్నమయి, సంచితమైన శక్తియావత్తూ నేడు మనముందు 'జాతీయత' రూపంలో నిలచి ఉంది. దానిని మనస్ఫూర్తిగా ఆరాధిద్దాము" అంటూ నివేదిత భారత స్వాతంత్ర్య పోరాటంలో జాతీయతకు ప్రాణప్రతిష్ఠ చేసింది.

"సోదరులారా భారతవర్షంలో వేలసంవత్సరాల నుండి సామాజిక జాతీయ సంరక్షణకై వంశాభిమానం అనే భావన పోషించబడుతోంది. హరిశ్చంద్రుని వంశంలో పుట్టడమంటే సత్యంకోసం సర్వం త్యాగం చేయడం, రాముడి వంశంలో పుట్టడమంటే ప్రాణంపోయినా మాటపోరాదనే నీతికి కట్టుబడి ఉండడం. తాను శివాజీ వారసుడనని భావించే వ్యక్తి హిందురాష్ట్ర ప్రతిష్ఠాపనలో వెనుక ఉండలేదు. ఈ వంశాభిమానం అంటే మనకు లభించిన ఈ వారసత్వం పూర్వీకుల ద్వారా మనకందించబడిన దివ్యచిరంతన జ్యోతి" అంటూ సూరత్‌లో జరిగిన యువకుల సమ్మేళనంలో ప్రసంగించింది. జాతీయ వారసత్వంపై ఇంత స్పష్టమైన అవగాహన ఉన్నవారు జాతీయనాయకులలోనే అరుదు అంటే అతిశయోక్తి కాదు.

ఆమె ఏ పట్టణానికి వెళ్ళినా, ఏ సభలలో ప్రసంగించినా విజాతీయమైన ప్రతీ దానిని ఖండించేది. ఎవరైనా "హిపిప్ హుర్రే" లాంటి పాశ్చాత్య నినాదాలిస్తే వారిని తీవ్రంగా మందలించేది. నినాదాలలో కూడా దాస్యభావనేనా అని ఈసడించుకొనేది. కాళీమాతకీ జై, గురుమహారాజుకీ జై, భారతమాతకీ జై వంటి నినాదాలు ఇమ్మని ప్రేరేపించేది.

కాంగ్రెస్ అధికారికంగా స్వదేశీ ఉద్యమం ప్రారంభించడానికి ముందే నివేదిత స్వదేశీ వస్తు ఉపయోగం, స్వదేశభావ ప్రాచుర్యం గురించి తీవ్రకృషి చేసింది. ఆమె స్వయంగా స్వదేశీ వస్తువులనే వాడేది. "స్వధర్మే నిధనం శ్రేయః, పరధర్మో భయావహః" అనే గీతా వాక్యాన్ని చదువుతూ ఆమె యువకులకు స్వధర్మం, స్వదేశీ, స్వభావాల గురించి బోధించేది. సతీశ్‌చంద్ర ముఖర్జీ ప్రారంభించిన విద్యార్థి సంస్థ 'ది డాన్'లో ఆమె పాల్గొని విద్యార్థులకు పై విధంగా మార్గదర్శనం చేస్తూ ఉండేది.

జాతీయ కళాశాల విద్యార్థులకు ఆటల పోటీలు జరుగుతున్న సందర్భంగా ఆమె నాగపూర్ వెళ్ళింది. పోటీల అనంతరం విజేతలకు బహుమతి ప్రదానం చేయాలి. ఆమె ఆ సందర్భంలో ప్రసంగిస్తూ "ఇక్కడ హాకీ, క్రికెట్ వంటి విదేశీ ఆటలు ఆడడంచూసి నాకు బాధ కలిగింది. ఇది భోన్సలేల రాజధాని. కనుక ఇక్కడ శౌర్యపరాక్రమాల ప్రదర్శన చూస్తానేమో అనుకున్నాను. కానీ కోతుల ఆటవంటి విదేశీ అనుకరణను చూడవలసి వచ్చింది. ఈ విషయం ముందే తెలిస్తే అసలు వచ్చేదానినే కాదు" అంది.

నిర్వాహకులకు సహజంగానే పౌరుషం వచ్చింది. మరుసటి రోజు ఆమె సమక్షంలో నాగపూర్ వస్తాదుతో మల్లయుద్ధం, కుస్తీ, నియుద్ధ పోటీలు జరిగాయి. ఇది తిలకించిన ఆమె గద్గద స్వరంతో "ఇటువంటి యువకులవలనే నూతన రామాయణం లిఖించబడుతుంది. రావణులు ఇప్పుడు కూడా ఉన్నారు. ఇప్పుడు శ్రీరాములే కావాలి." అంది.

భావదాస్యాన్ని నిరసిస్తూ ఈ జాతీయులకు జాతీయతను గుర్తుచేసిన సంఘటన మరొకటి ఈమె భారతదేశం వచ్చిన తొలుతలోనే జరిగింది. వివేకానందుని ప్రేరణపై ఆమె బెంగా

ల్‌లోని ప్రముఖులతో పరిచయం పెంచుకుంటూ రవీంద్రనాథ్ ఠాగూర్ కుటుంబాన్ని కూడా కలిసింది. రవీంద్రుని కుటుంబం అప్పుడు బ్రహ్మసమాజ ప్రభావంలో ఉండేవారు. నివేదిత ఉపాధ్యాయని అని తెలిసి తమ కుమార్తెకు ఆంగ్లం నేర్పవలసిందిగా ఈమెను కోరారు.

నివేదిత దానికి స్పందిస్తూ, సంస్కృతం నేర్పించమని సలహా యిచ్చింది. ఈ దేశపు మహిళలకు కావలసిన జాతీయభావ పరిజ్ఞానం సంస్కృతం వలనే వస్తుందని చెప్పింది. అంతేకాదు విదేశీ ప్రభావం పిల్లలపై పడడం దేశ అధోగతికి హేతువు అని హితవు చెప్పింది.

రవీంద్రునికి నివేదిత అంటే చెప్పలేనంత అభిమానం. నివేదిత ఆయనను కలిసిన మొదటిసారే భారతీయత పట్ల, హిందుత్వం పట్ల ఆమెకున్న ప్రేమాభిమానాలను గమనించి ఆయన ముగ్ధులయ్యారు. నివేదిత గురించి ఆయన ఒక సందర్భంలో వ్రాస్తూ "ఆమె కేవలం ఒక హిందూ సన్యాసిని కనుక గౌరవించడం కాదు-ఆమె గొప్పది కనుక మనం గౌరవించాలి. ఆమె కేవలం మనవంటి భావాలున్న వ్యక్తి కనుక కాక మనకంటే ఉన్నతురాలు కనుక మనం గౌరవించాలి."అని వ్రాసారు. ఆయన అద్భుత సాహిత్య సృష్టిలో ఒకటయిన 'గోరా' నవలలో గోరాపాత్రను నివేదిత వ్యక్తిత్వం ఆధారంగానే సృష్టించారంటే అతిశయోక్తి కాదు. కథానాయకుడు గోరా ఒక ఐరిష్ సైనికునికి పుట్టినవాడు. నివేదిత కూడా ఐరిష్ వనిత కదా!

## అరవిందునితో

వివేకానందుని మరణానంతరం నివేదిత జరిపిన భారత పర్యటనలో, బరోడా వెళ్లినపుడు మొదటిసారిగా అరవిందుని కలు

నుకుంది నివేదిత. అరవిందుడు తండ్రి ప్రోద్బలంచే పాశ్చాత్య విద్యనభ్యసించినప్పటికీ భారతదేశం పట్ల అచంచలమైన ప్రేమ వలన, ఐ.సి.ఎస్. పరీక్షను కూడా కాదనుకొని స్వాతంత్ర్య పోరాటంలో దుమికినవాడు. 'కాళీమాత' అనే నివేదిత వ్రాసిన వ్యాసం చదివి తీవ్రంగా ప్రభావితుడైనాడు. బరోడాలో ఉద్యోగం చేస్తూ ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా పత్రికలలో అనేక వ్యాసాలు వ్రాసేవాడు. నివేదిత ఈ వ్యాసాలలోని వేడినీ, వాడినీ గమనించి, అరవిందుని కలుసుకోవాలనుకుంది. మొదటి సారి కలసిన వెంటనే కలకత్తా వచ్చి విప్లవ కార్యక్రమాలలో పాల్గొనవలసిందిగా నచ్చచెప్పింది. శ్వేత జాతీయురాలైనప్పటికీ భారతదేశంపట్ల ఈమెకు గల తీవ్ర అభిమానాన్ని గమనించిన అరవిందుడు ఈమెను విప్లవ సంస్థల అనుసంధాన సమితిలో సభ్యురాలిగా చేసి, విప్లవోద్యమంలో ప్రత్యక్ష భాగస్వామిని చేసాడు.

1909 సూరత్ కాంగ్రెస్ మహాసభల సందర్భంగా తీవ్రవాదుల తరపున తీవ్రంగా పని చేసాడు. బిపిన్ చంద్రపాల్, బాలగంగాధర తిలక్‌లకు నివేదితను పరిచయం చేసాడు. ఆ తరువాత నివేదిత, ప్రోద్బలంపై బరోడా నుండి కలకత్తా వచ్చి 'నేషనల్ కాలేజీ'లో ప్రిన్సిపాల్‌గా చేరాడు. తీవ్రజాతీయ భావాలను ప్రచారం చేయడానికి 'యుగాంతర్' పత్రికను నడిపేవాడు. నివేదిత ఈ పత్రికకు తరచు వ్యాసాలను వ్రాస్తూ ఉండేది.

అరవిందుడు జైలునుండి విడుదలై వచ్చిన తరువాత ఆయనలో వచ్చిన విశేషమైన మార్పును నివేదిత మాత్రమే గ్రహించగలిగింది. వివేకానందుని వద్ద ధ్యానాది ఆధ్యాత్మిక విషయాలలో శిక్షణపొందిన నివేదితకు ఎదుటిమనిషిలోని ఆధ్యాత్మిక భావాలను చదవడంలో కష్టమేముంది. అందుకే అరవిందుని ముఖంలో నూతనంగా గోచరిస్తున్న అలౌకిక తేజస్సును గమ

నించింది. రామకృష్ణ వివేకానందుల వలెనే ఈయన కూడా భగవత్సాక్షాత్కారం పొందాడని గ్రహించింది. ఆ ఆధ్యాత్మిక పరంపర వీరి వలన కొనసాగుతుందని సంతసించింది.

విప్లవకారులను ఆంగ్ల ప్రభుత్వబారినుండి తప్పించుకోడానికి ఫ్రెంచ్ పాలనలోనున్న చంద్రగిరిగానీ, పుదుచ్చేరిగానీ, వెళ్లమని నివేదిత సూచించేది. చంద్రగిరిలో వీరికి వసతి ఏర్పాటు చేసే కృషి కూడా చేసింది. అందుకే అరవిందుడు పుదుచ్చేరి వచ్చి స్థిరపడ్డాడు. "అరవిందుడు మొదటినుండి మాతను ఆరాధిస్తూనే యున్నాడు. జైలులో ఉండగా ధ్యానరూపంలో ఆరాధించాడంతే!" అని తరువాత ఒక వ్యాసంలో వ్రాసింది.

అరవిందుని నిష్క్రమణానంతరం 'యుగాంతర్' పత్రికను అది నిషేధింపబడేవరకు నివేదిత తన సంపాదకీయంతో, నిర్వహించింది!

## రచయిత్రి

నివేదిత భారతదేశం రాకముందే ఒక పరిణతి చెందిన రచయిత్రిగా, సాహిత్యవిమర్శకురాలిగా పేరు గడించింది. భారతదేశంలో కూడా ఆమెకు మంచిపేరు రావడానికి ఆమె రచనలు కూడా ఒక కారణం. వివిధ దినపత్రికలలో ఆమె విభిన్న విషయాలపై వ్రాసిన వ్యాసాలు ప్రకటింపబడుతుండేవి.

భారతీయ స్వాతంత్ర్య పోరాటాలకు ఆయువు పట్టైన వివిధ జాతీయ నాయకులు నిర్వహించిన పత్రికలలో ఆమె వ్యాసాలు వ్రాస్తూ ఉండేది. బిపిన్ చంద్రపాలుని 'న్యూ ఇండియా' పత్రిక, అరవిందుని యుగాంతర్ పత్రిక, తిలక్ నిర్వహించిన మరాఠాకేసరి పత్రికలను ఈమె తన వ్యాసాలద్వారా ప్రోత్సాహిస్తూ ఉండేది. జోసఫ్ మేజినీ, గారిబాల్డీ మొదలైన విప్లవకారుల చరిత్రలలోని

గంభీర విషయాలను తన రచనల ద్వారా విప్లవకారుల దృష్టికి తెచ్చేది.

బ్రహ్మవాదిని, ప్రబుద్ధభారతి, కర్మయోగిని మొదలైన వేదాంత పత్రికలలో భారతీయ వేదాంతసారం గురించి, భారతీయ మౌలిక ఏకాత్మత గురించి అనేక వ్యాసాలు వ్రాసేది.

వివేకానందుని పలుకులను గుర్తుకుతెస్తూ క్రైస్తవ, ఇస్లాంమతాలవలె, హిందూత్వాన్ని కూడా తీవ్రతరం (aggressive) చేయడమెలాగ అనే విషయాన్ని చర్చిస్తూ 'తీవ్రహిందూత్వం' అనే వ్యాసాన్ని వ్రాసి సంచలనం సృష్టించింది.

"Foot falls of Indian History (భారతీయ చారిత్రక పాదముద్రలు)" అనే ఆమె వ్రాసిన గ్రంథం భారతీయ చరిత్రకు అద్దం పడుతుంది. "ఒక జాతి చరిత్ర అంటే ఆ జాతి ప్రజల అంతశ్చేతనంలో లిఖించబడిన వారి జాతీయ శీలపు వివరణే. జాతీయశీలము ఎటువంటిదో తెలుసుకోడానికి చరిత్ర తెలుసుకోవాలి" అని చరిత్ర గురించి ఒక అపూర్వ విశ్లేషణను ఇస్తుంది ఈ పుస్తకంలో. 'ఈ దేశపు అణువణువునా ఈ జాతి చరిత్ర నిక్షిప్తం చేయబడింది' అంటూ శిధిలావస్థలో నున్న వివిధ చారిత్రక కట్టడాల గురించి ఆందోళన వ్యక్తం చేసింది.

హైందవమహిళ అంటే నివేదితకు ఎనలేని గౌరవం. వివిధ హిందూ సామాజిక, కుటుంబ సాంప్రదాయాలను సశాస్త్రీయంగా వివరిస్తూ హైందవ మహిళ ఔనత్యాన్ని విశ్లేషిస్తూ ఆమెకు స్వేచ్ఛలేదని ఎవరన్నారు? పాశ్చాత్యులకు హిందూమహిళ మాతృత్వాన్ని అర్థం చేసుకోవాలంటే ప్రస్తుత పరిజ్ఞానం సరిపోదు అని వ్రాసింది. Web of Indian Life "(చిక్కుముళ్ల భారతీయ జీవనం)" అనే గ్రంధంలో.

చాలాతక్కువ సమయంలోనే హైందవ పురాణేతిహాసాలను అర్థంచేసుకోవడమే కాక ఆ పురాణగాథలన్నింటినీ "హిందూ జోలపాటల కథలు (Cradle tales of Hinduism) గా వ్రాసి భాగ వతోత్తములు జాబితాలో చేరింది."

వివేకానందుని భావాలను నివేదిత అర్థం చేసుకున్నంతగా మరెవరూ చేసుకోలేదంటే అతిశయోక్తి కాదు. ఎందుకంటే వివే కానందుని చాలా దగ్గరనుండి పరిశీలించిన వనిత ఈమె. ఒక విధంగా చెప్పాలంటే భగవానుడు విశ్వరూపాన్ని అర్జునుడికి చూపించినట్లు స్వామిజీ కూడా నివేదితకి తనంటే ఏమిటో స్పష్టంగా తెలియజేసారు. అందుకే వివేకానందుని మనము సరిగ్గా అర్థం చేసుకోదలిస్తే ఆయా సంపూర్ణ గ్రంథావళిని పఠించడం కంటే ఆయన గురించి ఈమె వ్రాసిన నేను కాంచిన గురువర్యులు (The Master as I sawhim) అనే ఆయన జీవన విశ్లేషణను చదివితే సరిపోతుంది. 'వివేకానందుని జీవసందేశం' అనే మకుటంతో వివేకానందుని సంపూర్ణ గ్రంధావళికి మొదటి ప్రచురణకు "ముందు మాట" ఈమే వ్రాసింది.

భారతీయ మౌలిక ఏకాత్మత గురించి, హిందుత్వ జాగరణ గురించి ఈమె వ్రాసిన అనేక వ్యాసాలు, పరిశోధించి విశ్లేషించి నేటి హిందూసామాజిక పరిస్థితులకు అన్వయించుకోదగినవి.

## కళాభిమానము

చిత్రకళలో భారతీయతకు ప్రాణంపోసిన వనిత సోదరి నివే దిత. ఆరోజుల్లో చిత్రలేఖనమంటే పాశ్చాత్యభావాలకు రూపక ల్పన చేయడమే! దీనిని నిరసిస్తూ ఆమె సంపర్కంలోకి వచ్చిన కళాకారులకు హిందూపురాణ గాథలలోని సన్నివేశాలను వివరించి

వాటిని చిత్రించమని ప్రోత్సహించింది.

అవనీంద్రనాథ్ ఠాగూర్ మంచి చిత్రకారుడు. ఆయనను భారతమాత చిత్రం వేయవలసినదిగా ప్రోత్సహించింది. 1906లో ఆయన చతుర్భుజిగా కాషాయవస్త్రధారిణిగా 'భారతమాతను' మొదటిసారి చిత్రించినప్పుడు ఎంతో సంబరపడింది. ఇటువంటి కళవలన జాతీయత ప్రతిబింబిస్తుంది. రాబోయే తరాలకు అంది వ్వబడుతుంది అని వ్రాసింది. ఇంకా నందలాల్ బోస్ మొదలైన చిత్రకారులను వివిధ పురాణ సన్నివేశాలను చిత్రించవలసిందిగా ప్రోత్సాహమిచ్చింది.

రామకృష్ణమఠం చిహ్నాన్ని తయారుచేయడంలో కూడా ఈమె ఎంతో శ్రద్ధ తీసుకొంది. వివేకానందునితో ఈ విషయంపై ఆయన మరణానికి ముందే చర్చించింది.

1906 భారత జాతీయ కాంగ్రెస్ సమావేశాల సందర్భంగా ఈ దేశానికి జాతీయ పతాకాన్ని చిత్రించి ఇచ్చింది. కాషాయ ధ్వజంపై రెండు వజ్రాయుధాలు వేసి ఉండి వాటిపైన 'వందే మాతరం' క్రింద 'యతోధర్మస్తతోజయః' అనే ధ్యేయవాక్యాలు వ్రాసి ఉంటాయి. వజ్రాయుధాలు శక్తికీ, దధీచి మహర్షి వంటి పుణ్యపురుషుల త్యాగానికీ ప్రతీకలు అని ఆమె వివరించింది. త్యాగంవలన ఉత్పన్నమయ్యే అనంతమైన శక్తికి వజ్రాయుధము చిహ్నమని ఆమె భావన.

# అజ్ఞాతవాసం

దేశంలో పెరుగుతున్న తీవ్రస్వాతంత్ర్య కాంక్షను ఆంగ్లప్ర-భుత్వం తన దమనకాండచే అణచివేయ జూసింది. లాలాల-జపతిరాయ్ వంటి జాతీయ నాయకులను ఖైదు చేయించింది. వివేకానందుని సోదరుడు యుగాంతర్ పత్రిక ఉపసంపాదకుడూ-నైన భూపేంద్రనాథ్ దత్‌ని కూడా రాజద్రోహ నేరంపై అరెస్టు చేసారు. తన పాఠశాల కొరకు సేకరించిన పదివేల రూపాయలను కానుకగా చెల్లించి భూపేంద్రుని బెయిల్ మీద విడిపించింది నివేదిత. ఆ తరువాత అతనికి ఒక సంవత్సరం కారాగార శిక్ష పడింది.

భూపేంద్రుని విషయంలో ఈమె చూపిన ఆసక్తిని గమ-నించిన ప్రభుత్వం ఈమెపై నిఘా ఎక్కువ చేసింది. దానితో ఆమె మిత్రులు, హితులు, సన్నిహితులు ఆమెను కొంతకాలం దేశం విడిచి వెళ్ళమని ఒత్తిడి తేసాగారు. ఆమె ఆరోగ్యం కూడా దెబ్బతిని ఉన్నది. బెంగాల్ కరువు సమయంలో ఆమె చేసిన సేవల వలన విశ్రాంతి లోపించింది. అమెరికానుండి శ్రీమతి సారాబుల్ మొదలైనవారు కూడా రమ్మనమని, ఉత్తరాలు వ్రాస్తున్నారు.

ప్రయాణవార్త ఎవరికీ తెలియనీయకుండా 1907 ఆగస్టు 15 న ఆమె మళ్లీ లండన్ బయలుదేరింది. సుమారు ఐదు-సంవత్సరాల తరువాత మళ్ళీ తల్లిని కలుసుకొంది. నివేదిత గడుపుతున్న హిందూ సన్యాసిని జీవితం ఆమె తల్లికి ఎంతో నచ్చింది. స్వామిజీ మరణానంతరం ఈమె లండన్ రావడం ఇదే మొదటిసారి కనుక అనేకమంది స్వామిజీ శిష్యులు ఈమె వద్దకు వచ్చి, స్వామిజీ అంతిమ సమయ విశేషాలు అడిగి తెలుసుకొనేవారు. ఆమె వివేకానందుని జీవన సందేశం గురించి,

హిందూ ధర్మం గురించి అనేక ఉపన్యాసాలనిచ్చింది.

ఉపన్యాసకురాలిగా లండన్ వచ్చిన జగదీశ్ చంద్రబోస్ దంపతులను కలుసుకొని వారి వద్దనే ఉండ వారంభించింది. గోపాలకృష్ణ గోఖలే, బిపిన్ చంద్రపాల్, రమేశ్ చంద్రదత్, ఆనందకుమార్ స్వామి, సావర్కార్ వంటి జాతీయ నాయకులను విప్లవ నాయకులను కలుసుకొని వారితో భారతదేశ రాజకీయ ఆర్థిక విషయాలను గురించి చర్చించింది.

అనేకమంది శాసనసభ్యులను పాత్రికేయులను కలుసుకుంటూ వారితో భారతదేశ విశేషాలను చర్చించి, భారతీయుల మనోభావాలను గౌరవించవలసినదిగా విజ్ఞప్తి చేసింది. భారత అనుకూల వాతావరణాన్ని నిర్మాణం చేయడంలో కృతకృత్యురాలైంది. పత్రికలలో వ్యాసాలు వ్రాసి, అనేకచోట్ల ఉపన్యాసాలు ఇచ్చి ఆంగ్ల ప్రభుత్వం భారతదేశంలో చేస్తున్న దమనకాండను ప్రజల దృష్టికి తీసుకొని వెళ్లి అందరి దృష్టిని భారతదేశం వైపు మళ్లించింది. ఇంగ్లండు కామన్స్ సభలో భారతదేశ విషయాలు చర్చకు వచ్చినప్పుడు కామన్స్ సభకు నివేదిత ప్రత్యేక ఆహ్వానితురాలిగా వెళ్లేది!

అక్కడినుండి ఐర్లాండు వెళ్లి నూతనంగా వివాహమైన తన సోదరుడు రిచ్‌మాండ్‌ను కలుసుకొంది. స్వేచ్ఛావాయువులు పీల్చుకొన సన్నద్ధమవుతున్న ఐరిష్ జాతీయులను చూసి నా భారత ప్రజలలో ఈ చైతన్యము ఎప్పుడు వస్తుందా అని మథన పడింది.

శ్రీమతి బుల్ ఆహ్వానంపై అమెరికా వెళ్లి అక్కడ కూడా తన రచనలు, ఉపన్యాసాలద్వారా భారతదేశ సమస్యలను వారి దృష్టికి తీసుకొని వెళ్లింది. వివేకానందుని తత్వం గురించి సాధికారికంగా చెప్పగలిగిన ఏకైక వ్యక్తి నివేదిత అనే అభిప్రాయం అమెరికన్లలో కలిగించింది. అమెరికాలో విద్యాభ్యాసం

చేస్తున్న భారతీయ యువకులను సమీకరించి వారిలో విప్లవ బీజాలు నాటింది. కారాగార శిక్ష పూర్తి చేసుకొని అమెరికా వచ్చిన భూపేంద్రనాధ్ దత్‌ని మళ్లీ ఉత్సాహపరిచింది.

తల్లికి అనారోగ్యంగా ఉన్న వార్త తెలిసి వెంటనే లండన్ బయలు దేరింది. నివేదిత రాక కొరకే ఎదురు చూస్తున్న మేరీ కుమార్తె ఒడిలో తలపెట్టుకుని ఇహలోక యాత్ర చాలించింది. తల్లి మరణంతో భూమిపై తనకి ఉన్న చివరి బంధనాలు కూడా తెగిపోయినట్లు భావించింది. తన హృదయంలో "ఇప్పుడు లయకారకుడైన శివుడు ప్రణవరూపంలో నాట్యం చేస్తున్నాడ"ని ఒక స్నేహితురాలకి ఉత్తరంలో వ్రాసింది. ఆమె మనసంతా అపూర్వమైన ఆధ్యాత్మిక ప్రశాంతతో నిండిపోయింది.

నివేదిత పశ్చిమ దేశాలలో అజ్ఞాతంలో ఉన్న అన్ని రోజులూ తన నిధి సేకరణను అశ్రద్ధ చేయలేదు. చివరికి 1909 జూలై 2వ తేదీన కుమారి మేక్లౌడ్, శ్రీమతి సారాబుల్, డా. బోస్ దంపతులతో కలిసి భారతదేశం ప్రయాణమైంది. అదే రోజున మదన్‌లాల్ ధింగ్రా కర్జన్ విల్లీన్‌ని లండన్‌లో తుపాకీతో కాల్చిచంపాడు!

## మళ్లీ గంగాతీరానికి

నివేదిత రెండుసంవత్సరాల అజ్ఞాతవాసానంతరం తిరిగి భారతదేశం చేరింది. ఈ రెండు సంవత్సరాల కాలంలో భారత విప్లవోద్యమ చరిత్రలో అనేక ముఖ్య ఘట్టాలు జరిగాయి. 1908 ఏప్రియల్‌లో ఖుదీరాంబోస్ కింగ్స్‌ఫోర్డ్‌ని బాంబువేసి చంపే ప్రయత్నం చేసి విఫలుడైనాడు. బెంగాల్ గవర్నర్ ఆండ్రూపై హత్యాప్రయత్నం జరిగింది. బిపిన్ చంద్రపాల్, బాలగంగాధర్

తిలక్, అరవిందుడు అరెస్టు కాబడ్డారు. నాయకత్వ లేమి వలన నిస్సత్తువ ఆవరించి ఉంది. ఆలీపూర్ కుట్రకేసులో బరీంద్రఘోష్ ఇంట్లో విప్లవ సాహిత్యం దొరకడం వలన ఆతనికి మరణశిక్ష విధించబడింది. బరీంద్రఘోష్ నివేదితకు కుమారుని వంటివాడు. ఆ తరువాత మరణశిక్ష రద్దు చేయబడి ఆ జీవన కారాగార శిక్ష విధించబడింది. ఆతనితోనే అరెస్టు కాబడిన అరవిందఘోష్ మాత్రం చిత్తరంజన్ దాస్ విశేష న్యాయవాదపటిమ వలన ఒక సంవత్సరం తరువాత విడుదల చేయబడ్డాడు.

అరవిందుని విడుదల నివేదితకు పండుగే అయింది. పాఠశాలను అలంకరించి అందరికీ మిఠాయిలు పంచి పెట్టింది. జైలు నుండి విడుదలైన అరవిందుడు యోగీశ్వరుడైనాడు. నిస్సత్తువతో ఉన్న సమాజాన్ని పునర్జాగృతము చేయడానికి కంకణబద్ధుడైనాడు. 1909 జూలై 19, కర్మయోగి పత్రికలో సంపాదకీయం వ్రాస్తూ "జాతీయ జీవనవాహిని నేడు చిన్న చిన్న కాలువలుగా విడిపోయి ప్రవహిస్తోంది. రాజకీయ, ఆధ్యాత్మిక ప్రవాహాలు కూడా విడివిడిగానే ప్రవహిస్తున్నాయి. రాష్ట్రశక్తికి దోహదం చేసే వివిధ స్ఫూర్తి స్రోతస్సులకు భూత వర్తమానాలనుండి వెలికి తీయాలి....... వీటితో ఈ ప్రవాహాలను ఏకత్రితం చేయాలి" అని సూచించాడు. ప్రపంచ మానవాళి అంతటికీ అధిమానసిక తత్వాన్ని అందించారు.

అరవిందుని తిరిగి అరెస్టు చేయవచ్చుననే ప్రభుత్వకుత్సిత ఆలోచన గురించి వార్త అందింది. ఈసారి అరెస్టయితే దేశబహిష్కరణ శిక్ష విధింపబడవచ్చు! అందుకని నివేదిత ఆయనను వెంటనే ఫ్రెంచిపాలనలోని చంద్రనగర్ వెళ్లిపోమని సూచించింది. అరవిందుడు చంద్రనగర్ చేరి అక్కడినుండి ఫిబ్రవరి 27, 1910 న పుదుచ్చేరి చేరేవరకు కుమారుని కొరకు ఆరా-

టపడే తల్లిలా ప్రవర్తించింది. అరవిందుని కర్మయోగి పత్రికకు తనే సంపాదకురాలిగా ఆ పత్రిక బహిష్కరింపబడేవరకు పనిచేసి నిర్వహించింది. చివరిరోజుల్లో ఒక సంపాదకీయంలో ఈ విధంగా వ్రాసింది.

"భారతదేశము అభేద్యమైనది అజేయమైనది అని నా నమ్మకం. ఏక కుటుంబ భావనపైన, ఏకరీతి ప్రేమాసక్తులపైన మాత్రమే జాతీయ సమగ్రత నిర్మితమవుతుంది............ భారతదేశపు వర్తమానము భూతకాలంలో వేళ్ళూని ఉజ్వలంగా ప్రకాశిస్తోంది..........ఓ జాతీయతా నా సుఖదుఃఖాలలో, నా మానావమానాలలో నన్నావహించి నన్ను నీ దాసిని చేసుకో." ఈ విధంగా భారతజాతీయతలో మమేకం చెందిన అనుభూతి పొందిన తరువాత నివేదిత తిరిగి తన ఆధ్యాత్మిక సాధనలో మునిగిపోయింది. అంత భౌతిక సంఘర్షణలోనూ అరవిందుడు భగవత్సాక్షాత్కారం పొందడం ఆమెకు స్ఫూర్తిదాయకమైనది.

## ప్రణవరూపప్రాప్తి

తన ఆధ్యాత్మికతాసాధనలో భాగంగా నివేదిత మళ్లీ ఒకసారి హిందూదేశ శాశ్వత జీవప్రదాతలైన హిమాలయాలకు తీర్థయాత్రలకు వెళ్లింది. నివేదితకంటే వయసులో పెద్దవాడయినప్పటికీ ఆమెను తల్లిగా భావించే డా. జగదీశ్ చంద్రబోస్ భార్యాసమేతంగా ఆమె వెంట వెళ్లారు.

నివేదితకు బోస్ దంపతులు భారతదేశం వచ్చిన మొదటిరోజులలోనే పరిచయమయ్యారు. వృక్షశాస్త్రంలో ఆయన చేసే పరిశోధనలను ఈమె ఆసక్తితో పరిశీలిస్తూ ఉండేది. డా. బోస్ మార్కోనీ కంటె ముందే రేడియో తరంగాల వ్యాపకతను కను-

గొన్న, మేధావి. వృక్షశాస్త్రంలో పరిశోధన చేసి మొక్కలకు ప్రాణము ఉన్నట్లే, అతి సున్నితమైన నాడీవ్యవస్థ కూడా ఉన్న-దనీ నిరూపించి ప్రపంచానికి మొక్కల గురించి, సర్వప్రాణుల ఏకాత్మత గురించి ఓనమాలు నేర్పిన ఈ దేశపు బిడ్డ.

వృక్షశాస్త్రంలో ఈయన జేస్తున్న పరిశోధనలను ఆంగ్లే-యులు వెలుగులోకి రాకుండా అణచివేస్తున్న సమయంలో నివేదిత ఆయనకు చేదోడు వాదోడుగా నిలచింది. ఆయన పరిశోధనా వ్యాసాలు అమెరికా, ఫ్రెంచ్ దేశాలలో ప్రచురిం-పబడేలా చూసి ఆయన్ను ప్రపంచ విజ్ఞానవేత్తలకు పరిచయం చేసింది. అందువలనే నివేదిత అంటే డా. బోస్‌కి ఆయన భార్య శ్రీమతి అబాలాబోస్‌కి ప్రాణం కంటే ఎక్కువ. ఆమెను కంటికి రెప్పలా కాపాడుకుంటూ ఉండేవారు. ఈమెను మొదటిరోజుల్లో భారతీయ ప్రముఖులకు పరిచయం చేసింది వీరే.

యాత్రల్లో ఉండగానే శ్రీమతి సారాబుల్‌కి ఆరోగ్యం బాగో-లేదని, నివేదితను చూడాలనుకుంటోందని తంతి వచ్చింది. నివేదిత వెంటనే అమెరికా బయలు దేరింది. శ్రీమతి బుల్ అంతిమక్షణాలలో ఈమె కొరకు ఎదురుచూస్తోంది. నివేదిత వివేకానందుని సందేశ వాక్యాలు చదివి వినిపిస్తుండగా ఆమె 1911 న జనవరి 18 భగవస్సాన్నిధ్యం పొందింది. శ్రీమతి బుల్ కుమార్తె తల్లి ఆస్తి కొరకే నివేదిత వచ్చిందనుకొని అవమానించింది. భారమైన హృదయంతో ఏప్రియల్ 7 న భారతదేశం తిరిగి వచ్చింది.

వచ్చేనాటికి నివేదితకు బెంగాలీ నేర్పిన స్వామీ సదానంద ఫిబ్రవరి నెలలో అనారోగ్యం వలన పరమపదాన్ని పొందారు. వివే-కానందుని తల్లి భువనేశ్వరిదేవి కూడా అనారోగ్యంతో బాధ-పడుతున్నదని తెలిసి అక్కడకు వెళ్లింది. ఈమె సమక్షంలోనే

ఆమె కూడా కన్నుమూసింది.

పాఠశాలకూడా అనుకున్నంత ఉత్సాహంగా నడవడంలేదు. శ్రీమతి బుల్ నుండి నివేదిత ఊహించిన ధనసహాయం రాలేదు. మింటో సతీమణికి నివేదిత అంటే మంచి అపేక్ష ఉన్నప్పటికీ నివేదిత ఆమెనుండి సహాయాన్ని కోరదలచుకోలేదు. జాతీయ ప్రభుత్వము ఏర్పడేవరకు ప్రభుత్వసహాయము పొందకూడదని మొదటే నిశ్చయించుకుంది. పాఠశాల పనిని చూస్తున్న సోదరి క్రిస్టిన్, సోదరి సుధీరలు ఒకరి తరువాత ఒకరు పాఠశాల నుండి మానివేశారు.

ఈ మానసిక ఒత్తిడిలో ఉండగానే ఎడతెరిపి లేని ప్రయాణాలవలన ఆమె ఆరోగ్యం బాగా దెబ్బ తిన్నది. అక్టోబరు నెలలో డార్జిలింగ్ వెళ్ళాలని, అక్కడ నవరాత్రి పూజలు చేసుకోవచ్చని, నివేదితకు వాతావరణం మార్పు కూడా జరుగుతుందని బోస్ దంపతులు నిశ్చయించుకున్నారు. డార్జిలింగ్ బయలు దేరే సమయం దగ్గరపడే కొద్దీ ఆమె మనసు ఏదో తెలియని ఆరాటానికి లోనవ్వసాగింది.

అందరి దగ్గరా క్రమంగా సెలవు తీసుకోసాగింది. 'కలకత్తా చూడడం ఇదే ఆఖరుసారి' అని అంటోంది. శారదామాత ఆశీస్సులకోసం వెళ్లింది. కాని ఆ సమయానికి శారదామాత పుట్టింటికి వెళ్లింది! ఏదో తెలియని వేదనను మూగగా అనుభవిస్తూ మాతకు మనస్సులోనే ప్రణామాలర్పించి వచ్చేసింది. సాక్షాత్తు రామకృష్ణ పరమహంసకు సేవచేసి ధన్యురాలైన శతాధిక వృద్ధురాలు జోగీన్ మాతను దర్శించుకొంది. ఆమె పాదాలకు నమస్కరించి ఆర్తితో ఆమె కౌగిలిలో ఇమిడిపోయింది కొంతసేపు.

"జోగీన్మా! నేనిక తిరిగిరాను ఇదే నా తుది వీడ్కోలేమో

అనిపిస్తోంది" అన్న నివేదిత మాటలను జోగినీమాత ప్రేమతో "తప్పు అలా మాట్లాడకూడదు" అని కొట్టి పారేసింది.

ఆ తరువాత ఆమె బోస్ దంపతులతో కలిసి డార్జిలింగ్ వెళ్ళింది. ఈసారి నివేదిత సాండక్‌ఫు పర్వతాలకు వెళ్లి హిమాలయ సానువుల్లో ప్రతిధ్వనిస్తూ ఉండే శివానందాన్ని తనివి తీరా అనుభవించదలచుకొంది. అక్కడకు బయలుదేరుతున్న సమయంలోనే ఈమెకు రక్తవిరేచనాలు పట్టుకొన్నాయి. బోస్ దంపతులు కంగారు పడుతున్నారు. అదృష్టవశాత్తు అప్పుడే ప్రఖ్యాత వైద్యుడు శ్రీ గనేన్ మహారాజు నివేదితను చూడడానికి వచ్చారు. ఆయన బేలూరు నుండి వస్తూ ఒక బుట్ట నిండా పళ్లను కూడా తీసికొని వచ్చారు.

డా. గనేన్ మహారాజు ఎంత ప్రయత్నం చేసినా ఆమె మామూలు మనిషి కాలేదు. రక్తస్రావం అధికమవ్వడం వలన చాలా నీరసించిపోయింది. అయినా ఆమె ముఖం ఎంతో ప్రశాంతంగా, ఒక భావాతీత ఆనందాన్ని అనుభవిస్తున్నట్లు చిరునవ్వుతో ఉంది.

ఎప్పుడూ మబ్బులతో నిండి ఉండే డార్జిలింగ్ ఆకాశం ఆవేళ మేఘరహితంగా ఉంది. ఎండ చాలా ప్రకాశవంతంగా ఉంది. "పడవ మునిగి పోతోంది ప్రణవం వినిపిస్తోంది. నా ప్రయాణం పూర్తికావస్తోంది సూర్యోదయం అదుగో" అని కలవరిస్తోంది నివేదిత. ఒకసారి బోస్ దంపతులను దగ్గరకు రమ్మని కోరింది. తనకు అత్యంత ప్రియమైన ఉపనిషన్మంత్రాన్ని పఠించమని కోరింది. ఆమె కూడా వారితో గొంతు కలిపింది.

అసతోమా సద్గమయ తమసోమా జ్యోతిర్గమయ

మృత్యోర్మా అమృతంగమయ -అనే ఆ మంత్ర పఠనం పూర్తి

అయిన వెంటనే శివపంచాక్షరీ జపిస్తూ తన మెడలోని రుద్రాక్షమాలను స్పృశించబోయింది. కానీ ఆ చెయ్యి మధ్యలోనే క్రిందకు వాలిపోయింది.

1911 అక్టోబరు 13 వ తేదీన నివేదిత భారతమాతలో ఐక్యమైంది. అంతిమ సంస్కారాలను డార్జిలింగ్‌లోనే నిర్వహించారు. డార్జిలింగ్ రైల్వేస్టేషన్ దగ్గరలోనే ఉన్న హిందూ శ్మశానవాటికలో నిర్మించిన ఆమె స్మృతి చిహ్నంపై

ఇక్కడ
భారతదేశానికి తన సర్వస్వము
సమర్పించిన
రామకృష్ణ వివేకానందుల
నివేదిత
అస్థికలు ఉంచబడ్డాయి. అని వ్రాసి ఉంచారు

ఓం శాంతిః శాంతిః శాంతిః